# వారణాసి శ్రీ రామ కృష్ణ
# ఆఫ్ అమరావతి   కధలు కబుర్లు
# సంగతులు

## 13-05-24 to 14-07-24






ఉక్రేన్ --రష్యా యుద్ధపు కబుర్లు **14-07-24**

ఉక్రేన్ --రష్యాయుద్ధము సందర్భంగా మరొక విచిత్రం బయట పడింది . ఉక్రేన్ కూడా వ్యవసాయక దేశము . భూమిని సాగు చేయటానికి అనేక మందికి ట్రాక్టర్ లు ఉంటాయి . యుద్ధము కారణంగా వ్యవసాయం సజావుగా జరగటం లేదు .ఉన్న ట్రాక్టర్లు అన్నీ తిరగటం లేదు . వాడకం లో లేని ట్రాక్టర్లు తుప్పు ఎక్కి పోతున్నాయి . వ్యవసాయం మందగించటం వల్ల ఉక్రేన్ రైతులు తమ ట్రాక్టర్లు బాగు చేయించు కోవటం లేదు . ఇదివరలో ట్రాక్టర్లకు రిపేర్లు చేస్తూ మహారాజుల్లా బ్రతికిన ఉక్రేనియన్ ట్రాక్టర్ మెకానిక్ లు నేడు చేయటానికి పని లేక , చేయి నిండా సంపాదన లేక అశాంతితో గగ్గోలు పెడుతూ వున్నారు .యుద్ధము నుండి ఇలాంటి అశాంతి కూడా జనిస్తుంది .

<><><>

ఇప్పటికి ఒక నాలుగు రోజుల క్రిందట అనుకోండి - భారత ప్రధాని మోడీ గారు రష్యా ని సందర్శించి రష్యా అధ్యక్షుడు పుతిన్ తో సంభాషణలు జరిపారు .

"రష్యా సైన్యములో పని చేస్తూ ఉన్న భారతీయులను సత్వరమే తిరిగి వాపసు పంపి వేయాలని " మోడీ కోరారు . "అందుకు పరిశీలిస్తాను " అని పుతిన్ చెప్పారు .

రష్యాకు జపాన్ కు పడదు .అందువల్ల ఒక జపాన్ టీవీ వారు - రష్యా మరియూ ఉక్రేన్ కి జరుగుతున్న యుద్ధములో, రష్యా తన తరపున పోట్లాడటానికి - తగినంత సైన్యము లేక పోవటం వల్ల నేపాలునుండి వచ్చే గుర్ఖాలను తన సైన్యములో చేర్చుకొని వారికి జీతాలు చెల్లించి - ఆ కిరాయి సైన్యముతో యుద్ధము నడుపుతూ వున్నదని చెప్పింది . దీనిని గురించి నేను ఒక పోస్టు కూడా వేసాను . అదే జపాను టీవీ వారు ఇప్పుడు భారతీయులు రష్యా తరఫున ఉక్రేన్ తో యుద్ధము చేస్తూ వున్నారని చెప్పింది .

ది టైమ్స్ అఫ్ ఇండియా లో వార్త ఇలా వుంది ."Ever since the Russia-Ukraine war broke out, India has been been pressing Russia to ensure the safety and repatriation of its nationals employed by the Russian Army " ఈ వార్తలో రష్యా ఆర్మీలో ఉద్యోగాలు పొందిన భారతీయులు " అన్న మాటలు వున్నాయి . అంటే రష్యా ఇండియన్లకు ఆర్మీ ఉద్యోగాలు ఇస్తూ వున్నది . వ్యక్తుల శారీరక ధృఢత్వము మానసిక స్థితి నిఅంచనా వేసుకొని మరీ ఉద్యోగాలు ఇస్తున్నది . ఇప్పుడు వీరి సంఖ్య పదులలోనే వున్నది . ఒక వంద మంది వరకూ ఉండవచ్చు అని బీబీసీ వారి

కధనం . వీరికి నెలకు ₹1.95 లక్షల వరకూ జీతం ఇస్తూ వున్నారు . ఈ ఉద్యోగాల పేరు ఆర్మీ హెల్పర్స్ . వీరు రష్యన్ సైన్యములో ని ఏ విభాగానికి కేటా ఇంప బడతారో - ఆ విభాగము తో పాటు వెళ్లి వారు చెప్పిన పనులు చేయాలి .

బీబీసీ వారి వార్త కధనాల ప్రకారం -రష్యా ఇండియన్ లకి ఇచ్చే ఉద్యోగాలని మిలిటరీ ఉద్యోగాలు అని చెప్పకుండా దాచి పెడుతుంది . ది వీక్ అనే పత్రిక కధనం ప్రకారం ఈ ఉద్యోగాలు IT ఉద్యోగాలు అనే భ్రమ కల్పిస్తారు .

భారతీయులు రష్యా సైన్యపు సహాయకులుగా ఉక్రేన్ బోర్డర్ వరకూ వెడుతున్నారు ,

ఉక్రేన్ వారు వేసిన బాంబులు, మిసైళ్ల వల్ల రష్యన్ సైన్యము తో పాటు వుండే ఇండియన్లు కూడా తమ వుద్యోగం చేస్తూ మరణిస్తూ వున్నారు .

వార్త కధనం బై వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

మనచుట్టూ ఏమి జరుగుతూ వున్నదో తెలుసుకో వాలనే వారి కోసం రాసాను కానీ వేరే ఉద్దేశ్యాలు లేవు

—-----------------

**16.** తిస్య రక్ష మరియూ కునాల **12-07-24**

అశోక చెక్రవర్తికి  01.దేవి 02 .కురువకి  03 .పద్మావతి 04 .అసందిమిత్ర ,05.  తిష్యరక్ష .అని ఐదుగురు భార్యలు .

తిస్య రక్షా అనే ఆమె "ఆనందిమిత్ర " కి ముఖ్య పరిచారికగా వచ్చి - ఆమె మరణం తరువాత అశోకుని తన ప్రేమా వ్యామోహములో పడవేసుకుని అశోకునికి భార్య అయ్యింది . ఈ తిస్యరక్షా అశోకుని కొడుకు మరియూ అశోకుని రాజ్యానికి వారసుడు అయినా కునాలుడు అనే వాడిని అంధునిగా చేసింది .

కునాలుడు అశోకునికి మరియూ పద్మావతీకి పుట్టిన పుత్రుడు . అశోకునికి కునాలుడే కాక   తివాల అనే మరొక పుత్రుడు కూడా వున్నాడు . ఇతడు అశోకునికి "కురువకి" కి పుట్టిన వాడు . తివాల అనగా గంభీరమైన సముద్రము వంటి వాడు అని అర్ధము .

అశోకుడు , బుద్ధుని యొక్క అవశేషాల మీద 84  వేల స్మారక స్తూపాలు నిర్మించటం పూర్తి చేసిన రోజున కునాలుడు జన్మించాడు . అప్పుడు అశోకుడు " నేను ధర్మం  ప్రకారము పాలించాను - నాకు కొడుకు జనించాడు - ఇతడు కూడా ధర్మమూ ప్రకారము పాలిస్తాడు " అని

పలికాడు .    అదివిన్న సభలోని పండితులు ఆ పిల్లవాడికి " ధర్మ వర్ధనుడు "అనే పేరు పెట్టారు . అశోకుడు తన కుమారుని  చూసి మురిసిపోతూ " ఇతనికి వున్నత అందమైన  కన్నులు మరొకరికి వుండవు" అని పలికాడు . ఇది విన్న పండితులు ఒక పోలిక చెపుతూ " పిల్లవాడి కన్నులు హిమాలయాలలో తిరుగాడే "కునాల" అనే అందమైన  పక్షి కి వున్న  కన్నులను కలిగి వున్నాడు అని  పలికారు . అప్పుడు అశోకుడు ఆ పక్షిని పట్టి తెప్పించి ఆ పక్షి కన్నులతో తన కొడుకు కన్నులతో పోల్చి సంతృప్తి పడి, అప్పటినుండీ  తన కుమారుడిని కునాలుడు అనే పేరుతో పిలిచాడు .

ఒక తండ్రి తన కొడుకు కన్నులను గురించి, అపురూపమైన ఆనందముతో వున్నాడు .   తన భర్త ఐన అశోకునికి ఎంతగానో నచ్చిన అతని కుమారుని కన్నులను నాశనం చేయటానికి తిస్య రక్ష అనే తల్లి కాని తల్లి  పూనుకున్నది .

ఒకనాడు అశోకుడు "కుక్కుట ఆరామ " అనే ఒక బౌద్ధ మఠాన్నిసందర్శించాడు .

ఈ మఠము లో ఉన్న" యాసస్ " అనే బౌద్ధ సన్యాసి కునాలుని కన్నులు త్వరలోనే ధ్వంసం చేయబడతాయాని - భవిష్యత్తు లోకి చూసి తెలుసుకోగలిగాడు . అప్పుడు ఆయన " ఓ రాజా ,, అన్ని కష్టాలకూ మూల కారణము కన్నులు . వాటితో నిరంతరమూ అప్రమత్రత్తతో ఉండాలి . కన్నులు స్నేహితుల రూపములో వున్న శత్రువులు . కన్నులు స్త్రీల పట్ల ప్రేమను చూపించుతాయి కానీ స్త్రీల పట్ల చూపించ వలసిన అప్రమత్తతను చూపించవు . కన్నులు క్షణ కాలంలో మనను మోసం చేసే సాధనాలు . కన్నులు మనకే పాపకర్మాలు చేయించుతాయి " అని ప్రవచించాడు .
పుట్టుకతోనే ధర్మ వర్తనుడైన "కునాలుడు " ఈ మాటలు శ్రద్ధగా విన్నాడు .విని ఇంత అందమైన కన్నులు నాకు ఎందుకు వున్నవి ? , నమ్మ దగిన స్వభావము లేని ఈ కన్నులు నన్ను ఏ రకంగా మోసం చేయనున్నవి ? నాచే ఏమి పాపము చేయించ నున్నవి? అని ఆలోచిస్తూ ధ్యాన నిమగ్నుడు అవుతూ వుండే వాడు వుండే వాడు . ఈ ఆలోచన మూలకంగా తన కన్నులు ఉన్నా లేకున్నా మంచిదే అన్న భావం లోకి కునాలుడు చేరుకున్నాడు అనవచ్చు.

ఒకనాడు కునాలుడు ధ్యానము  ముగించి కనులు తెరిచేసరికి తిస్యరక్ష అతని వద్దకు వచ్చి " నీ నీలి కన్నులు నన్ను నీ ప్రేమలో పడవేస్తూ వున్నాయి .నా గుండెలు నీ కోసం కొట్టుకుంటూ వున్నాయి " అనే మాటలను పలుకుతుంది .

దీనికి కునాలుడు -" తల్లీ ఇటువంటి పాపపు మాటలను ఆపండి . నేను మీ కుమారుడిని అని మరిచారా ? అవమాన కరమైన ఈ మాటల దారిని వీడండి .ఈ దారిన మనము అదః పాతాళపు లో లోపలి కి పోతాము " అని పలుకుతాడు .

అందుకు తిస్య రక్ష " నీ కన్నుల మీది వ్యామోహముతో ప్రేమతో నీ చెంతకు వచ్చాను , నీవు తిరస్కరించావు . నీ కన్నులు దుర్భర పరిస్థితులను ఎదుర్కుంటాయి చూడు " అని జపించి నట్లుగా పలికి  అని అక్కడనుండి వెడలి పోయింది .
దీనికి కునాలుడు " నేను ధర్మ మార్గమును అనుసరించి మరణించనైనా మరణిస్తాను గానీ - అధర్మము ఆచరించను " అని పలుకుతాడు .

తిస్య రక్ష " నీ కన్నులను నాశనం చేస్తాను " అని లోలోన ప్రతిజ్ఞతీసుకుంది.

రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

తిస్య రక్ష- కునాలుడిని అంధుని చేసింది **13-07-24**

తన ప్రేమను , తనకు కుమారుడు వరుస -అయిన కూనలుడు తిరస్కరించాడనే కచ్చతో వున్న తిస్య రక్ష, అందుకు ప్రతీకారంగా తనను ఎంతగానో ఆకర్షించిన కునాలు ని కన్నులను ధ్వంసం చేయటానికి అనేక పధకాలు ఊహిస్తూ వున్నది . విధి ఆమెకు అనుకూలించింది .

ఇప్పుడు తక్షశిల లో అశోకుని మీద ఎదో తిరుగుబాటు స్వరం వినిపించింది . ఈ తిరుగు బాటును అణిచి వేయటానికి గానూ, అశోకుడు తన కుమారుడైన కునాలుడి కి కొంత సైన్యాన్ని సమకూర్చి అతడిని తక్ష శిల మీదకు యుద్దానికి పంపాడు .

సైన్యము   పాటలీ పుత్ర పుర వీధులకుండా యుద్ధానికి వెడుతూ ఉండగా , వీధులలో వున్న ముసలీ ముతక రోగిష్టి జనాలను వీధులలోనుండి ఆవలికి తరిమి వేశారు { అచ్చం ఈనాడు జరిగినట్లే జరిగింది }

అశోకుడు కునాలునితో  " నీ అందమైన దయ నిండిన కన్నులు చూడ నున్న ఆ తక్ష శిల వాసులు అదృష్టవంతులు " అని చెప్పి తన కన్నుల నీరు నింపు కున్నాడు .  { అశోకుడు కునాలుని కన్నులను నేటికీ ప్రేమిస్తూనే వున్నాడు.  కానీ అతని భార్య తిస్య రక్ష ఈనాడు ఆ కన్నలనే ద్వేషిస్తూ వున్నది .}

కునాలునికి తక్షశిలలో ఘన స్వాగతం లభించింది. తప్పుడు నిర్ణయాలు తీసుకున్న కొందరు మంత్రుల మీద ప్రజలు తిరగ  పడ్డారు  తప్ప ,  అశోకుని రాజ్యాధికారం మీద ఎవరూ తిరగపడలేదు అని నిర్ధారణ అవటంతో, కునాలుడు  యుద్ధము అనేది ఏదీ చేయలేదు .

కునాలుడు అటు పోగానే అశోకుడు జబ్బు పడ్డాడు . జబ్బు వైద్యులకు లొంగుట లేదు .  అశోకుడి శరీర విసర్జనాలలో దుర్వాసన అధికమవుతూ వున్నది . ఈ

లక్షణాలకి భపడిన  అశోకుడు మంత్రులను పిలిచి "కునాలని రప్పించండి - అతనికి సింహాసనము ఒప్పగించుతాను " అని పలికాడు .

కునాలుడు సింహాసనము అధిష్టించితే ఇక తన ప్రతిజ్ఞ నెరవేరనట్లే - మురిగి పోయినట్లే ,  అని భావించిన తిస్యరక్ష ప్రేమతో అశోకుని వద్దకు వెళ్లి , " వైద్యులు నేను చేసే పనిలో జోక్యం చేసుకోక పోతే - నేను మీ జబ్బును తగ్గించగలను " అని పలికింది . దీనికి అశోకుడు అంగీకరించాడు .ఆపై  తిస్యరక్ష రాచ వైద్యులను పిలిచి "నా భర్తకు ఉన్నటువంటి రోగ లక్షణాలతో నే భాధ పడుతున్న మరొకరు ఎవరన్నా ఉంటే వారిని నా ఎదుటకు తీసుకు రండి " అని అగ్న్యా  పించింది . వారు "అభిరా " అనే వాడిని తీసుకు వచ్చారు . తిస్య రక్ష "అభిరా " ని చంపించి అతని పేవులు పరిశీలించి , ఆ పేగుల్లో ఒక పెద్ద నులి పాము { పెద్ద వాన పాము లాంటిది }  ఉండటం గుర్తించింది.  తిస్య  దాని మీద కారము , ఉప్పు , నిమ్మరసము వంటి వాటిని చల్లింది . చివరిగా ఉల్లిపాయల రసము చల్లినపుడు  ఆ నులి పాము మరణించించింది . అప్పుడు తిస్య రక్ష  అశోకునితో " స్వామీ మీరు ఉల్లి పాయలు అధికంగా తినండి " అని చెప్పింది .

"క్షత్రియులు ఉల్లిపాయలు తినరు కదా ?ఎలాగూ ? " అని అశోకుడుముందుగా  అడ్డు చెప్పి చివరికి " ఒక మందుగా భావించి ఉల్లిపాయలు తినటంలో తప్పు లేదు" అనే నిర్ణయానికి వచ్చి ఉల్లి పాయలు ఆహారంతో పాటుగా తిన్నాడు . అశోకుని జబ్బు తగ్గింది .

జబ్బు తగ్గిందన్న ఆనందముతో అశోకుడు తిస్యరక్షను ఏదన్నా వరము కోరుకో మన్నాడు .

" ఒక వారం రోజుల పాటు నన్ను రాజ్యం ఏలనివ్వండి " అని తిస్యకోరుకుంది .ఈ రకంగా ఆమె అశోకుని రాజ్యానికి తాత్కాలిక పాలకు రాలు అయ్యింది .ఆ వెనువెంటనే తిస్య " నా పేరుకు కళంకము తెచ్చిన కునాలు కన్నులు పీకి వేయండి "అంటూ అశోకుని పేర ఒక ఉత్తరువును తయారు చేయించి , దాని పై కావల్సిన రాజముద్రిక కోసం అశోకుని వద్దకు వెళ్ళింది .{ "కళంకము తెచ్చిన "అన్న మాటలోనే ఆమె వ్యూహ రచన , అవగాహన మరియూ తెలివి అంతా ఇమిడి వుంది }
కలత నిద్ర పోతున్న అశోకుడు తిస్య అలికిడికి నిద్ర లేచి "దుఃస్వప్నము కన్నాను . కునాలు డు కన్నులు

పోగొట్టుకొని - దేశదిమ్మరి వాలే తిరుగుతూ నాకు అగుపించాడు " అని చెప్పాడు. " అటువంటి స్వప్నములు మంచివే " అని నమ్మ పలుకుతూ , తిస్య అశోకుని రాచముద్రను పొంది దానిని లేఖపై వేసింది . ఆ లేఖను తక్ష శిలకు పంపించింది .

ఇటు తరువాత అశోకునికి మరొక స్వప్నము వచ్చి , అందులో తన దంతాలు అన్నీ ఊడి పడినట్లు కనపడింది .ఈ స్వప్న ఫలితాన్ని చెప్పుటకు వచ్చిన పండితులు " రాజా ఇట్టి స్వప్నము వచ్చిన వారి పుత్రుని కన్నులు ధ్వంసం అయి పోతాయి అని శాస్త్రము చెపుతోంది " అని విన్నవించారు .తన స్వప్నము ఫలించకుండా ఏదన్న విరుగుడు చూడమని అశోకుడు అడిగాడు . వారు ఏమీ చెప్పలేక పోయారు .

కునాలుని కన్నులు పీకి వేయాలన్న ఆజ్ఞ్యలు తక్ష శిల లోని మంత్రులకు చేరాయి , వారు ఆ లేఖను చదివి "అశోకుడు - మన కునాలుని యుద్ధము చేసి గెలిచి రావలసింది" అని కోరగా , ఇతడు తన స్వంత నిర్ణయము ప్రకారము యుద్ధము చేయక ఆగి పోయాడు . దీనికి కోపించిన అశోకుడు కుమారుని కన్నులు పెరికి

వేయమన్నాడు " అని అర్ధం చేసుకున్నారు . జనులు మరియూ మంత్రులూ ఇలాగే అర్ధం చేసుకుంటారు అని తిస్య రక్ష ముందే ఊహించి దీనికి అనుగుణంగా  తన పధకం పన్నింది }  మంత్రులు ఇంకా ఇట్లా అనుకున్నారు " అశోకునికి కోపము వచ్చినపుడు తన కన్న కొడుకుని కూడా క్షమించ నంతటి కసాయి అని తేలుతున్నది .  ఈ ఆజ్ఞ పాటించక పోతే మనకు కూడా మరణ దండన పడుతుంది "  అని దడిచి న   మంత్రులు ఎట్టకేలకు ఆ లేఖను కునాలునికి చదివి వినిపించారు .

రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

అశోకుని పుత్రుడు అంధుడు  అయినాడు   14-07-24

అశోకుని కొడుకు ఐన కునాలుడికి , .తక్ష శిల లోని మంత్రులు,  అశోకుని నుండి వచ్చిన  అగ్న్య  పత్రాన్ని చదివి విని పించారు . అందులో కునాలుని కన్నులను పెరికి వేయవలసింది అనే ఆజ్ఞ వుంది . ఈ ఆజ్ఞను అశోకుని  భార్య ఐన తిస్య రక్ష  మోసపూరితంగా , కల్పించి పంపించింది  . ఈ ఆజ్ఞనే తక్షశిల లోని మంత్రులు కునాలునికి చదివి విలిపించారు  .  విని పించి " చెంద్రునికి

మసి పూయాలనుకునే వారిని ఏమనాలి ? చంద్రుని వంటి నీ మోము నుండి నీ కన్నులను తొలగించే  దారుణ కృత్యాన్ని మేము చేయలేము " అంటూ తమ అసహాయతను  తెలిపారు .

అప్పుడు కునాలుడు తన సింహాసనం నుండి  దిగి వచ్చి " నా కన్నులు పెరికి వేసిన వారికి  ఆ సింహాసనం దక్కుతుంది " అనే ప్రకటన చేసాడు .  ఎవరూ ముందుకు రాలేదు . చివరికి ఒక కురూపి , 18  రకాల  దరిద్రపు చిహ్నాలు వంటి మీద కలవాడు ఒకడు  ముందుకు వచ్చాడు .

ఆ క్షణం లో కునాలుడి మదిలో "యసస్" అనే బౌద్ధ సన్యాసి చెప్పిన  "అన్ని కష్టాలకూ కన్నులే కారణము. వాటి పట్ల అప్రమత్తముగా వుండు.  కన్నులు స్నేహితుడి రూపములో వున్న శత్రువులు "అన్న  ప్రవచనాలు మారు మోగుతూ వున్నాయి .

కునాలుడు తన కన్నులు పీకటానికి వచ్చిన దరిద్రుడితో " ముందుగా ఓ కన్ను పీకి నా చేతిలో వుంచు " అని కోరాడు . వాడు అలాగే చేసాడు . కునాలుడు ఆ కంటిని చూపుతూ

" నా అధికారం ఎక్కడికి పోయింది ? నా అందం ఎక్కడికి పోయింది ?.ఈ కన్ను సత్యము అని చూపిన వి అన్నీ ఇప్పుడేమైనాయి ? కనులు నిజంగానే  మోసకారులు .కన్ను చెప్పిన దానిని అనుసరించి పోయిన వాడు పాపి అవుతాడు హేళనలకు గురి అవుతాడు " అని పలికాడు .

{కునాలుడు -  కన్నులను నమ్మ వద్దు అని చెపుతూనే , అశోకుని ఆజ్ఞ అని చెప్ప బాదుతూ  వున్న లేఖను చూసి అది అది నిజామా కాదా అని విచారించ కుండానే నమ్ముతూ వున్నాడు . విధి యొక్క                బలీయత అంటే ఇదే - తెలిసిన జ్ఞ్యానము  అంతా మరిచి పోవటం }

రెండో కన్ను కూడా పీక బడినపుడు కునాలుడు ఆనందించాడు . ఆ ఆనందముతో ఇట్లా అన్నాడు " దేముని సృష్టి సామర్ధ్యానికి రుజువులు అయిన ఈ కన్నులు ఇప్పుడు  మాంసపు గోళీలు.  ఇవి  నన్ను వీడినా గానీ నాకు భాధ లేదు . కన్నులు లేని వానికి దేముడే ద్రుష్టి అవుతాడు .కన్నులు లేని వాడు సృష్టి కర్త యొక్క పెంపుడు బిడ్డ అవుతాడు . కన్నులు లేక పోవటం వల్ల "వారికి వున్న  ఆ సంపద మనకు లేదే అని-- , మనకున్న ఈ సంపద  ఎటో  పోతున్నదే అనే దుఃఖము

రాదు . నేను ఈ రకపు దుఃఖము నుండినేను  బయట పడ్డాను " అని పలికాడు

కూనలుడికి ఈ పాటికే భార్య వున్నది . ఆమె పేరు కాంచన మాల . ఆమె భర్త అయిన కునాలుడితో  పాటుగా వచ్చి తన రాణి వాసం లో వుంది . కబురు ఆమెదాకా వెళ్లగా , ఆమె పరుగెత్తు కుంటూ వచ్చి , కునాలుడిని చూసి " నా వంటి మీద తచ్చాడి నన్ను పరవస  పరచిన ,  నా గుండెలలో మాధుర్య మైన రక్తాన్ని నింపిన , ఆ కన్నులు ఏవి ? నీ కన్నులు పోవటం అంటే , నా శరీరాన్ని చీల్చుకుంటూ, రక్త మాంసాలను వెదజల్లుతూ  నా ప్రాణాలు బయటికి పోవటమే కదా ? అని విలపించింది .

" మనము చేసిన పనులను { కర్మలను }పట్టి మనము ఫలితము పొందుతూ వున్నాము . ఇప్పటి వరకూ మనము బాధలను అనుభవించే వారి  కన్నా వేరుగా వున్నాము .ఇప్పుడు మనకు ఎదుట వారి దుఖఃమును భాధను  అర్ధం చేసుకొని వారిలో ఒకరిగా మారటానికి , మనకి మార్గము  దొరికింది " అనే ఓదార్పు మాటలు చెప్పాడు .

చివరికి ఎలాగో " కునాలుని కన్నులు పెరికి వేయండి" అంటూ వచ్చిన లేఖ నిజంగా అశోకుని ఆజ్ఞ కాదని బయట పడింది . కన్నులు చెప్పినది నమ్మ రాదు అని గ్రహించిన వారు ఎవరో తమ బుద్ధికి పదును పెట్టి యదార్ధాన్ని వెలికి తీశారు .
అప్పుడు కునాలుడు " నా తల్లికి ఏమీ శిక్ష పడక ఉండాలి . ఆమె ఆరోగ్యముతో కల కాలము జీవించాలి . నేను నా జీవిత గమ్యము చేరుకోవటానికి దారి చూపిన వ్యక్తిగా ఆమె మన్నింప బడాలి " అని కోరుకున్నాడు .
కునాలుడు కనులు కోల్పోయినందున ఇక ముందు అతడు అశోకుని రాజ్యానికి వారసుడు కాదు కాబట్టి, అతడు తక్షశిల నుండి పంపివేయబడ్డాడు . వారు బిక్షాటన చేస్తూ పాటలీ పుత్రకు చేరారు . వీరు ఎవరో ఏమిటో అనేది పోల్చుకోలేక సైనికులు వీరిని రాజా మందిరం లోనికి రానివ్వ లేదు .

సేకరణ రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి
అశోకుని శోక నివారణ **15-07-24**

కునాలుడు తన కనులు కోల్పోయినందున, ఇక ముందు అతడు అశోకుని రాజ్యానికి వారసుడు కాదు కాబట్టి, అతడు తక్షశిల నుండి పంపివేయబడ్డాడు . వారు బిక్షాటన చేస్తూ పాటలీ పుత్రకు చేరారు . వీరు ఎవరో ఏమిటో అనేది పోల్చుకోలేక సైనికులు వీరిని రాజ మందిరం లోనికి రానివ్వ లేదు . గుర్రపు శాలలో ఒక మూల పడి వండటానికి దయ తలిచారు .

గుర్రపు శాలలో ఒక మూల పడి ఉన్న కునాలుడు ఒకనాడు "మనిషి తన బుద్ధి జ్ఞనాలను- తన తెలివిగా వాడుకోవాలి - ఆ తెలివితో చావు పుట్టుకలు అనే అలల మధ్య ఈదాలి . నీకు నువ్వుగా తెలివితో విషయలోలత అనే బురద లో నుండి బయటబడి - ఆనంద సాగరము లోకి దూకాలి " అని పాడుతూ వున్నాడు
{నా వివరణ - వల/ గాలం బారిన పడకుండా తప్పించుకున్న చేప ఇప్పుడు ఎక్కడ ఈదుతున్నది ? అదే నీటిలో ఈదుతున్నది . కానీ అదే నీరు దానికి ఆనంద సాగరము అవుతున్నది - మనిషి విషయ లోలత నుండి బయట పడిన మనిషి మిగిలి ఉన్న జీవితాన్ని ఆనందముగా గడుపుతాడు }

ఈ పాటకు అశోకుడు మేల్కొని " ఆ కంఠము ఎంతో చిర పరిచిత మైనది గా వుంది . అతడు కునాలుడో ఏమో కనుగొనండి " అని సేవకులకు ఆజ్ఞాపించాడు . వారు తిరిగి వచ్చి " ఆ పాట పాడుతున్నది ఒక బిచ్చగాడు కునాలుడు కాదు "అని విన్నవించారు.
" అతడు ఎవరైతే నేమి ? అతని గొంతు వింటూ ఉంటే నా కునాలుడు  వచ్చి నా గుండెలలో దూరుతూ వున్నట్లుగా వున్నది . అతనిని ప్రవేశ పెట్టండి " అనే ఆజ్ఞ ఇచ్చాడు . కుమారుని గుర్తు పట్టిన అశోకుడు గుండె పగిలిన వానిలాగా నేల మీదకు విరుచుకు పడి పోయాడు . తిరిగి తెప్పరిల్లినాక " కునాల పక్షి వంటి కన్నులు కలవాడివని మురిసి నీకు "కునాల " అనే పేరు పెట్టుకున్నాను . ఇప్పుడు ఆ కన్నులు ఏమయినవి ? కన్నులు లేని కొడుకును చూసుకుంటే కొడుకును చూసుకున్నట్లు అవుతుందా ? " అంటూ  శోకించాడు . ఆపై మాటలు పెగుల్చుకొని " ఆకాశములో నక్షత్రాలను దోచుకున్నట్లు నీ కన్నులను దోచుకున్న వారు ఎవరు ?అని అశోకుడు ఆక్రోశించాడు .

తన భార్య తిస్య రక్షా ఒక మోసపూరితమైన లేఖ ద్వారా ఈ పని చేసిందని -   అశోకునికి తెలిసింది . అశోకుడు ఉగ్రుడు

అయ్యాడు ." ఆమె కన్నులను పీకించ మంటావా ? ఆమె అవయవాలను విడదీయ మన్నా నా ? చెర్మం వొలిపించ మన్నావా ? నాలుక కోయించ మంటావా ? విషం మింగించ మన్నావా ? " అంటూ కొడుకు ఆజ్ఞలను కోరాడు .

కునాలుడు ఇట్లా అన్నాడు "తండ్రీ - మనము అందరమూ ఇంతకు ముందు మనము చేసిన కర్మ ఫలితాలను ఇప్పుడు అనుభవిస్తూ ఉంటాము . అందువల్ల దుఃఖము కానివ్వండి , లేదా సుఖము కానివ్వండి . అది మనమే స్వయంగా ఏర్పాటు చేసుకుని వున్నది .మనమే మన కన్నులలో కన్నీరు ను - ఆనంద భాసుపాలను ఏర్పాటు చేసుకొంటున్నాము . దీనికి ఎవరిని నిందిద్దాము ? నేను గత జన్మలో విషపు ముళ్ళను పండ్లలో నాటనేమో . ఆ పండ్లు ఈ జన్మలో తింటూ వున్నానేమో " అని పలికాడు. ఆపై తండ్రిని కౌగలించి ఓదార్చాడు . ఆపై ఇంకా ఇట్లా అన్నాడు " తండ్రీ -నా తల్లి తప్పు చేసినదే కావచ్చు . మరల అదే తప్పు నీవేల చేయాలి ? శత్రుత్వము వహించటం , హింస చేయటం అనే దాని కన్నా ఓర్చుకోవటం, క్షేమించటము అనే గుణాలే మనసుకు ఎక్కువ ప్రశాంతత నిస్తాయి . ఇపుడు నా

మనసు మచ్చ తొలిగిన అద్దము వాలే వున్నది .నూనె మరక తొలిగిన వస్త్రము వాలే నా మనసు స్వచ్ఛ పడింది " అని చెప్పాడు .

పై సంభాషణ ను బట్టి కునాలుడు బుద్ధ భావానుని భోధనలోని సారాన్ని అణువణువునా జీర్ణించుకున్నాడు అని గ్రహింపు అవుతున్నది .

ఈ సంభాషణ అనంతరము కునాలుని కన్నులు తళ తళా మెరిసాయి . అశోకుని పట్ల బుద్ధ భగవానునికి వున్న దయ  ఆ కన్నులలో ప్రకటితము అయ్యింది  అశోకుని శోకము నివారణ అయ్యింది

రచన సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

ఉప సంహారము --  జాతక కథలు { బుద్ధుని యొక్క గత జన్మ వృత్తాంతాలు } అని వున్నవి . అందులో కునాల జాతకము ఒకటి  . అనగా ఇప్పటి మన కునాలుడు ఒకప్పుడు బుద్ధుని పూర్వ జన్మ . అందువల్ల ఈ కథలో బుద్ధుని ఫిలాసఫీని కొంత చొప్పించి , అతనికి కన్నులు

తెప్పించి , కథను సుఖాంతము చేశారు <> ఎన్నో కష్టాలు పడిన వారు చివరికి ఆనందముగా జీవించారు అని చదవటానికి సామాన్య ప్రజలుఇష్టపడతారు కాబట్టి దానికి అనుగుణంగా రచయితలు చారిత్రిక కధలను మారుస్తూ వుంటారు .  నేను సుఖాంతము ఐన కథను మీకు అందించాను . {కునాల జాతకము కూడా రాస్తాను} .

{2}ఇంకొక  చరిత్ర  ప్రకారము " కునాలు డు తన కన్ను లను నమ్మక లేఖను తెలివితో పరిశీలించి ఆ ఆజ్ఞ లో ఎవరో ఎదో మార్పులు చేశారు  అని తెలుసుకుంటాడు . అశోకుడు తిష్య రక్షకు మరణ దండన వేస్తాడు . కునాలుడు మౌర్య సామ్రాజానికి అధిపతి అవుతాడు

{3} ఇంతకూ లెటర్ లో ఏమి వుంది?  ఏమని మార్చ బడింది ? అనేది కూడా చూద్దాము . కునాలుడు వెళ్ళింది తక్ష శిలకు . అది విద్యల కేంద్రం . అశోకుడు అక్కడి గురువులకు "ప్రాకృత " భాషలో ఒక లేఖ రాసాడు . ఆ లేఖలో  "  "Adheetaam " - " అధీతం కరో" అనగా - కునాలుని విద్యావంతుడిని చేయండి అనే మాటను రాసాడు . తిస్య రక్షా   ఈ లేఖను చేజిక్కుంచుకోని , "Adheetaam " అనే మాటలో చిన్న మార్పు చేసి "aNdheetam  "అంధీతం కరో అనగా  "కునాలని అంధున్ని చేయండి  " అనే అర్ధం వచ్చేట్లు మార్చింది  .

తండ్రి ఆజ్ఞను అనుసరించి కునాలుడు తనను తాను గా ఇనుప సూదులను కళ్ళలో గుచ్చు కున్నాడు . కనులు లేని వాడు రాజ్యానికి అర్హుడు కాదు కాబట్టి - కునాలని కొడుకు అశోకుని మనమడు అయిన సంప్రతి "Samprati " అనే వాడు అశోకుని సామ్రాజ్యానికి వారసుడైనాడు .

ఏది ఏమైనా కునాలుడు తన తల్లి వరుస ఐన తిష్య  రక్షా కారణంగా అంధుడు ఐనాడని చెరిత్రలో అనేక మార్లు రాసి వుంది .

సేకరణ రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి




**Samprati was the grandson of Ashoka**



# 15 . మొన్నటి సంగతులు

మొన్నటి రోజున అనగా 06 -07 -24 న తిరువనంతపురం లో ఇస్రో వారి కింద వున్న , ఇండియన్ ఇన్స్టిట్యూట్అఫ్ స్పేస్ టెక్నాలజి - IIST కి వెళ్లి వచ్చాను . ఇస్రో వారు రాకెట్ ప్రయోగాలు చేసి భారత దేశాన్ని చంద్రుని పైకి, ఇంకా ఆ పైకి తీసు కెళ్లారు .ఇస్రో కి కావాల్సిన మేధావులను , శాస్త్రవేత్తలని IIST {డీమ్డ్ యూనివర్సిటీ } వారు తయారు చేసి ఇస్తారు .

ఈ 2024 సంవత్సరంలో మా అబ్బాయి వారణాసి సత్య శ్రీకాంత్ కి IIST వారు యావియానిక్ సైన్సెస్ లో పీహెచ్డీ { డాక్టరేటు డిగ్రీ } డిగ్రీ ప్రదానం చేశారు . ఈ యూనివర్సిటీ మన దేశం లోని ఒకే ఒక్కటి ,మన దేశానికి ఎంతో ప్రతిష్టాత్మక మైన మరియూ గర్వకారణమైన యూనివర్సిటీ . దీని ప్రతిష్ట ,దీని ప్రాముఖ్యత, ప్రమాణాల దృష్ట్యా - మన భారత ఉప రాష్ట్రపతి జయ దీప్ ధంకర్ గారు ఈ యూనివర్సిటీ కి ముఖ్య అతిధిగా విచ్చేసి ,విద్యార్థులకు పట్టా ప్రదానం చేశారు .

భారత ఉపరాష్ట్రపతి ప్రసంగాన్ని నేరుగా వినే అవకాశం లభిస్తుందని కొంత , ఇప్పుడు తప్ప మరెప్పుడూ నాలాంటి వారిని IIST లోకి అడుగు పెట్టనివ్వరు కాబట్టి . భారత దేశానికి తలమానికం అనదగ్గ యూనివర్సిటీ లోనికి అడుగు పెట్టిన అదృష్టవంతులలో ఒకడిని అవుదాము అన్న ఆలోచనతో కొంత, నేను IIST లోకి వెళ్లి వచ్చాను . మొత్తము ట్రిప్ అంతా విమాన ప్రయాణము గా వుండేట్లే మా అబ్బాయి ఏర్పాటు చేసాడు .

భారత ఉప రాష్ట్రపతి తన ప్రసంగములో "ఎప్పుడు కూడా నేర్చుకుంటూ ఉండాలి . లేక పోతే మీరు మీ జీవితం లో నుండి కిందకి దూకేస్తారు {if you do not learn you will dive from

your life} " అన్న మాటలు చెప్పారు . బహుశా ఈ మాట ఇది పేపర్లు లేదా టీవీలో వచ్చి ఉండదు .

"learn as long as .you live " అనేది నేను నమ్మి ఆచరించే సిద్ధాంతము .

" learn and learn learn always " అనేది నేను మాపిల్లకు చెప్పిన మాట . మా అబ్బాయి శ్రీకాంత్ నా మాటల్లోని విషయాన్ని, లోతును గ్రహించి, స్వయం కృషితో బాగా చదివి - పీ హెచ్డీ డిగ్రీ అందుకొని నన్ను ఆనంద పరిచాడు . ధంకర్ గారు చెప్పినట్లు 140 కోట్ల భారత జనాభాలో - ముందు వరుసలో నిలబడే పౌరులలో IIST విద్యార్థులు కూడా వుంటారు . ఇందులో మా అబ్బాయి కూడా ఉంటాడని ఊహించి , అందుకు గర్వించాను . ఇప్పుడు మా అబ్బాయి 140 కోట్ల భారతీయులలో ఒకడు అన్న చోటులో నుండి - 140 కోట్ల లో ఉన్న మొదటి కోటి మందిలో ఒక్కడు అన్న చోటులోకి పోయినాడు అనుకున్నా కూడా నాకు సంతోషమే . భారత దేశములోని మొదటి 14 లక్షల మందిలో ఒకడు అనే చోటుకు చేరే వరకూ అతడి లెర్నింగ్ కొనసాగాలని నేను కోరుకుంటున్నాను .

" నేర్చుకోవటమే జీవితానికి ప్రధాన గమ్యము " అని నేను ఎల్లప్పుడూ నమ్ముతూ వుండే సంగతి ని ఉప రాష్ట్రపతి గారు కూడా ధృవీకరించారు గదా అనీ , నేను నా రిటైర్ మెంట్ జీవితం సరైన లక్షముతోనే గడుపుతూ వున్నాను అనీ , ఆలోచన కలిగి , నా పట్ల నాకు ఎంతో సంతోషము అయ్యింది . ధంకర్ గారు ఒకప్పటి సుప్రీమ్ కోర్ట్ న్యాయ వాది , అందువల్ల అయన మాటలు

సగటు రాజకీయ నాయకుల మాటల వలే కాక ఏంటో విజ్ఞతతో కూడి మనకి మార్గనిర్దేశము చేయగలిగేవిగా వున్నాయి .

కొత్త సంగతులు నేర్చుకోకుండా - కొత్త విషయము కనపడినప్పుడల్లా - పాము ను చూసి బెదిరినట్లు బెదిరే వారు - కొత్త విషయాలనితిరస్క రించి  విమర్శించే వారు అనేకులు  నా స్వా అనుభవం లో కనపడ్డారు . ధంకర్ గారి మాటల వల్ల నైనా సరే అందరూ లెర్నింగ్ అనగా నేర్చుకోవటం అనే మార్గాన జీవన గమ్యంగా చేసుకోవాలని  నా విన్నపము .

**14.**కువేణి కథ
**{** శ్రీలంక వారి  చారిత్రక కథ **}**        28-6-24

విజయుడు అనే రాజు భారదేశము నుండి వెలివేయబడి శ్రీలంకలోకి ప్రవేశించాడు .విజయుడు లంకలో సాగి ముందుకు కదులు తూ ఉండగా ఆయన అయన అనుచరులు 700  మంది , కువేణి అనే యక్ష జాతికి చెందిన యువతి  కంట పడ్డారు. యక్షిణి అనగా దేవకన్య కాదు అని ,శ్రీలంకలో ఉన్న  ఒక ఆటవిక  మానవ జాతి లోని  తెగ వారిని యక్షులు అని పిలుస్తారు అని గమనించాలి .

కువేణి {నల్లని జుట్టు కలది } అనే ఈ యువతికి  సేసపతి { చిన్న సైన్యానికి రాణి} అని  కువన్న {కాకిరంగులో ఉండేది } అని మరియూ లీలావతి{ ఆటకాయి తనం కలది } అనే మరో మూడు పేర్లు వున్నాయి .

కువేణి ఒక కుక్కను--  విజయుడు   అనుచరుల వద్దకు పంపింది . వారు కుక్క ను చూసి " కుక్క  వున్నది అంటే ఇక్కడికి  దగ్గరిలో ఎదో గ్రామము వున్నది" అని భావించి,

కుక్క ను అనుసరించి వెళ్ళి, కువేణి కి ఖైదీలుగా చిక్కారు.
ఒక శ్రీలంక పురాణ కథ ప్రకారం Sumana Saman = సుమనా సమను అనే దేవుడు విఇజయునికి అండగా వున్నాడు . ఎందుకు అండగా వున్నాడు అంటే " "విజయుడు లంకకు వచ్చినపుడు అతని రక్షణ భాద్యత నీదే " అని బుద్ధభగవానుడు "సుమనా సమను" డికి ఆజ్ఞ ఇచ్చాడు . అందువల్ల అయన విజయుడికి రక్షణగా నిలిచాడు. "సుమనా సమను" దయతో తన అనుచరులకు ఏమి జరిగింది? ఎవరి వల్ల జరిగింది అనే సంగతి విజయుడు కని పెట్టాడు.



విజయుడు  కువేణి ని   చూసే క్షణానానికి ఆమె పత్తి నుండి దారం ఒడుకుతూ వున్నది .ప్రత్తి నుండి దారం ఓడకటం అనేది ఒక నాగరిక లక్షణము . దీనివల్ల కువేణి ఆటవిక జాతి యువతి కాదు  అని,  నాగరిక జాతి కి చెందిన  యువతి అని    విజయుడు అనుకున్నాడు  . విజయుడు కువేణితో ఏమో   అనునయపు మాటలు మాట్లాడి ,   తన  అనుచరులను  విడుదల చేయమని కోరాడు . అందుకు కువేణి " ఇప్పుడు యక్షులకు రాజుగా వున్నా వాడిని కూల దోసినట్లైతే " నీ మనుషులను విడిచి పెడతాను " అన్నది . ఇప్పుడు మనకు తెలిసేది ఏమంటే విజయుడి తో బేరసారాలు చేసేటందుకె -  కువేణి విజయుడిని మినహాగా మిగతా వారిని తన బందీలుగా చేసుకుంది . కువేణి మరియు విజయుడి మధ్య చెర్చలు ఫలించగా విజయుడి  అనుచరులు విడుదల అయ్యారు . విజయుడు  తన బలము బలగం తో కలిసి  యక్ష రాజుపై యుద్ధానికి పెళ్లి ఆయనను  గద్దె దించాడు .

అప్పుడు కువేణి " నేను నా రాజుకు రాణిగా ఉండాలిఅని కోరుకుంటున్నాను " అన్నప్రేమ వాక్యాలు పలికి , విజయుడు  తనని   రాణిగా స్వీకరించేటట్లు చేసుకుంది  . తాను ఒక రాణి కావాలనే ఉద్దేశ్యము తోనే  కువేణి

విజయునికి సాయం అందించింది అంటే తేలిపోతుంది . కువేణికి ఇద్దరు సంతానము కలిగారు . కొడుకు పేరు "జీవ హత్థా"   కూతురి పేరు" దీసల ".

విజయుడు  కువేణి ని పెండ్లి చేసుకున్నప్పుడు ఆమె పదహారు ఏండ్ల ప్రాయపుది . నల్లని జుట్టు , నల్లని కాకి రంగు వంటి శరీరము ఉన్నపటికీ , ఆమె చూపిన ప్రేమ మూలకంగా  విజయుడు కువేణిని రాణిగా అంగీకరించాడు .  ఒకనాడు విజయుడు ముందుగా ఏమీ చెప్పకుండా నే  కువేణిని పిలిచి " నీవు నీ బిడ్డలను నాకు ఇచ్చి వేసి అరణ్యములకు వెళ్లి పో " అని ఆదేశించాడు . ఇప్పటి వరకూ విజయుడు తాను ఎక్కడికి వెళ్లినా కువేణిని వెంట తీసుకు పోతూనే వున్నాడు . ఇప్పుడిట్లా ఎందుకు చేసాడో తెలియదు . కువేణి యొక్క నల్ల రంగు నచ్చక అని , ప్రేమ వ్యామోహం నశించి నందువల్ల అని , తెల్లని దేహము వున్నా స్త్రీని ప్రేమించి నందువల్ల అని ,అనేక కారణాలు తెలుప బడ్డాయి . నల్లని స్త్రీ పట్ల ఎవరికీ నీ కలకాలపు ప్రేమ  ఉండదు అనుకోవటమే సమంజసము అని నా అభిప్రాయము .

కువేణి  విజయునితో వాదన చేసి బిడ్డలను దక్కించుకొని
అరణ్య మార్గము పడుతుంది . అరణ్యము చేరు తూనే
ఆమె తన పిల్లలను అరణ్యములోనికి పంపించి వేస్తుంది
.కువేణి యొక్క అక్క ఈ అరణ్యములో నే ఉంటుంది .
పిల్లలలో వున్న తన పోలికలు చూసి తన అక్క ఆ
పిల్లలను పోల్చుకొని ఆదరిస్తుంది అని కువేణి ఆలోచన .
కువేణి తన బిడ్డలను విడిచి పుచ్చే ఆలోచన ఎందుకు
చేసింది ? అనేది చూద్దాము .
యక్షుల నీతి ప్రకారము - ప్రత్యుపకారము కోరి ఎవరికీ
సాయం చేయరాదు . చేసినాగానీ దానికి ప్రత్యుపకారంగా
నీవు నన్ను పెండ్లి చేసుకో అని అడిగి ఉండరాదు .
దీనివల్ల యక్ష జాతి సంకరము అవుతుంది . ఇహ
కువేణి "ప్రేమ ' లేదా 'రాణి పదవి'  అనే వ్యామోహములో
పడి - తన జాతికి రాజు ఐన యక్షుడిని పడ ద్రోయించింది
. వ్యక్తి ముఖ్యమా సమాజము ముఖ్యమా అని ఆలోచిస్తే
కువేణి
యక్ష జాతికి తీరని ద్రోహం చేసింది . లీలావతి గా  {
అటకాయి తనం కల యువతిగా } కువేణి చేసిన  పని
ఇప్పుడు ఆమెలో పాస్చాతాపాన్ని మేల్కొల్పింది
{ నామాట - ఒకరి ప్రేమకోసం తల్లి తండ్రుల కుటుంబాన్ని
తోసిరాజు అని వచ్చిన యువతి - కొంత వయసు

మళ్ళినాక తన ప్రవర్తన పట్ల పాస్చాత్తాపము పొంది " మా అమ్మ నాన్న నన్ను చంపినా సరే అందుకుంటూ పుట్టింటి లోకి అడుగు పెడుతుంది కదా ? ఇలాంటి ఆలోచనల్తోనే కువేణి అరణ్యములోని తన పుట్టింటి తెగ వారి వైపు నడిచింది . తాను చేసిన పని వల్ల తన పుట్టింటి తెగ వారు తనను చంపి వేస్తారు అని కువేణికి తెలుసు . మరి పిల్లలని ఏమి చేస్తారో ఆమె ఊహాకు అందలేదు .అందువలన వారిని అరణ్యము పాలు చేసింది .

తన పుట్టింటి తెగవారు తనని చంపి వేస్తారు అని తెలీసీ చావుకు సిద్ధ పడే కువేణి పుట్టింటికి వచ్చింది . కువేణిని ఆమె పుట్టింటి తెగవారు నిజంగానే కువేణిని నరికి చంపి వేశారు . ఆ రకంగా కువేణి జీవితము ముగిసింది అనటానికి వీలు లేదు .

కువేణి యొక్క ఇద్దరు పిల్లలనూ శ్రీలంక అరణ్యములోని ఆటవిక తెగ అయినా
"వేద్దా " అనే ఆటవిక కులస్తులకు దొరికారు . వారికి కువేణి యొక్క ప్రాణ త్యాగము సంగతి తెలిసింది . కువేణి యొక్క ప్రాణ త్యాగములోని గొప్పతనాన్ని గుర్తించిన

"పేద్దా " కులస్థులు కువేణి ని 01 .Maha Loku Kiriammaleththo అని 02 కరియమ్మ Kiriamma, అని 03 . ఉన్నపనే కరియమ్మ { Unapane కిరియమ్మ} 04 . కండె కరియమ్మ { Kande కిరియమ్మ} ,05 .దివస్ కరియమ్మ { Divas Kiriamma }, 06 .వెల్లస్ కరియమ్మ{ Wellasse Kiriamma }, 07 . కాకులవోళ్ల కరియమ్మ {Kukulapola కిరియమ్మ} 08 .బిలి కరియమ్మ { Bili Kiriamma} అనే పేర్లు కల దేవతను చేసి ఆరాధించుకున్నారు .

ఇహ విజయుడు చేసిన పనికి దేవతలు కూడా కోపపడ్డారు . అతని వారసులు ఎవరూ గద్దెనెక్కి రాజ్యము చేయకూడడు అని శాపం ఇచ్చారు . అంటే విజయ ని వారసులు రాజ్యము చేస్తారు కానీ గద్దెనెక్కి మాత్రము రాజ్యము చెయ్యరు . ఏదన్న బండ మీద కూచుని రాజ్యము చేయొచ్చును .

బుద్ధుని ఆజ్ఞకు లోను అయి - విజయుడిని రక్షించటానికి పూనుకున్న "సుమనా సమను" అనే దేవుడు గుర్తున్నాడా ? అందువల్ల విజయుడి వంశము నశించి

పోకుండా , ఆ వంశము వారే శ్రీలంకలో రాజ్యము ఎలారని మహావంశం అనే గ్రంధము చెపుతుంది .

కొన్ని సొంత మాటలతో - వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి చే చెప్పా బడిన శ్రీలంక యొక్క చారిత్రిక కథ.

{ఈ సందర్భంగా ఒక మాట - ఇది ప్రపంచ ప్రఖ్యాతి పొందిన కథ. ప్రపంచము లో ని ఎక్కడైనా సరే, మీరు ప్రత్తి నుండి దారము ఉడుకుతున్న స్త్రీ చిత్రము /లేదా శిల్పం - ఆమెకు కొద్దీ దూరంలో నిలబడిన పురుషుడు ఉన్నట్లు చూసి ఉంటే వారు నూటికి నూరు శాతము కువేణి మరియూ విజయులు అని నమ్మ వచ్చు }

**13.**బొమ్మ మాట బంగారు మూట **26-06-24**

పరాంకుశం అని మనవాడే వున్నాడు . కలెక్టర్ ఆఫీసులోపని చేస్తాడు . ఆఫిస్ లోనూ ఆఫీసర్ల మీదనూ మంచి పట్టున్న గుమస్తా .ఈయన పట్టిన పట్టుకు ఎక్కడెక్కడి వారో పరాంకుశం గృహాన్ని, అయన గృహ లక్ష్మిని, దర్శనం చేసుకునేందుకు వస్తూ వుంటారు .మీరు చూడండి ఏ గృహలక్ష్మి అయినా కానీ తన ఇల్లు శుభ్రంగా

లేనపుడు ఎవరికీ దర్శనం ఇవ్వదు - అనగా తలుపు తీయదు.
పరాంకుశం యొక్క గృహలక్ష్మికి కూడా దర్శనాలు ఇవ్వాలని - హారతులు అందుకోవాలని ఉండేదే . కానీ టైం చాలేది కాదు . కాలం చాలక పోవటానికి కారణం , ఆమె భర్తకు చెందినవి ఐదారు వందల చెప్పుల జతలు ఇంట్లో పడి ఉండేవి . వాటిని ఒక మూలకు తోసి తలుపు తెరిచే లోపున  వచ్చిన వాళ్ళు వెళ్లే పోయే వారు . ఈ రకంగా ఆమెకు తన దర్శనం కోరి వచ్చే వారిని చూడటానికి టైం కుదిరేది  కాదు .
పరాంకుశం ప్రతి రోజూ ఉభయ సంధ్య వేళలా  గుడికి  వెళ్లి వస్తాడు . తిరిగి వచ్చే టపుడు  కొత్త చెప్పుల జత తొడుక్కుని వచ్చి ఇంట్లో విడుస్తాడు .

చెప్పులతో ఇల్లు  నిండిందా అన్నట్లు ఇల్లు కనిపించేది . "తన భర్త చెప్పుల దొంగ "అని, ఆ చెప్పులను  చూసిన వారు ఈజీగా పసికట్టేస్తారన్న  భయంతో పరాంకుశం లక్ష్మి చెప్పులు సర్దుబాటు చేయకుండా తలుపు తీసేది కాదు .తలుపు సకాలం  లో
తీయక పోవటాన ఆమెకి ఏమి నష్టము వచ్చి ఉంటుంది అన్నది మీ ఊహకే వదిలి వేసాను .ఇంకో మాట ఏమిటంటే

అన్నీ కూడా అతి క్రొత్త  చెప్పుల జతలు . వాటిని బయట పారవేయాలంటే బంగారాన్ని బయట పారవేస్తున్న ఫీలింగ్లు వచ్చేవి పరాంకుస  లక్ష్మి లో . అందువల్ల , మీరు లేచినిలబడి 'మాస్టారు ఆమె చెప్పులు బయట పారవేయవచ్చునే ? అనే ప్రశ్న అడిగేందుకు ఆస్కారం కూడా లేదు.

పరాంకుశం వల్ల గుడి దగ్గర గందర గోళం మొదలైంది  . అది అతి పురాతన శివాలయం . రోజుకు ఫది వేలమంది దర్శనం చేసుకుంటారు . ఈ చెప్పుల దొంగ కారణంగా ఇప్పుడు ఆ సంఖ్య మూడువేలకు పడి పోయింది . గుడి మేనేజ్ మెంట్ వారు ప్రసాదం సేల్స్ తగ్గాయని - హుండీ కలెక్షన్ తగ్గిందని ఆందోళనను చెంది ఒక వీడియో కెమెరా పెట్టి - పరాంకుశం ను కనిపెట్టి - అతని ఆఫీస్ ను ఆనవాలు పట్టి - కలెక్టార్ ఆఫీస్ కు వచ్చారు .
ఆలయ ట్రస్టీ ని కలెక్టర్ గారు మర్యాద చేసి కూచో పెట్టాడు . పరాంకుశాన్ని పిలిపించి విచారణ జరిపి ఎక్సప్లనేషన్ అడిగాడు .
పరాంకుశం ఇట్లా అన్నాడు " సార్ బామ్మ మాట అంటే బంగారు మూట కదా ?

ఆమె బ్రతికి వున్నపుడు - చెప్పిన దాని ప్రకారం, ఆ గుడికి ప్రతి నిత్యం, మునులు , ఋషులు , సిద్ధ ,కింపురుష కిన్నెఋ లు , దర్శనానికి వస్తూ ఉంటారుట . వారు-- వారి కాలికి వేసుకున్న చెప్పుల వల్ల ఆకాశం లో ఎగురుతూ వస్తారుట . మరి ఎంతటి వాళ్ళైనా దేవాలయం ముందు చెప్పులు విప్పక తప్పదు కదా ? ఆలా వారు విప్పిన చెప్పులు నాకు దొరికి , నాకు ఆకాశం లో తేలే విద్య వస్తుందేమోనని చెప్పులు తీసుకు వచ్చి మా డాబా ఎక్కి నింగికి ఎగిరే ప్రయత్నం చేస్తూ వున్నాను . అప్పుడో సారి ఒక జత చెప్పులు తెచ్చాను . అందులో ని ఒకచెప్పును వేసుకుంటే అది నన్ను గాలి లోకి లేపింది .రెండోది కూడా వేసుకున్నా కానీ అది నన్ను గాలి లోకి లేపలేదు . పరిశీలనగా చూసి ఆ చెప్పు ఈ చెప్పులాగానే వుంది కానీ దీని జత చెప్పుకాదు అని తేల్చుకున్నాను . మిస్ అయినా ఆ రెండో మాయా చెప్పు కూడా దొరుకుతుందేమోనని - లేదా ఇంకో జత మాయా చెప్పులు దొరుకుతాయేమోనని చెప్పులు తెచ్చు కుంటూ వున్నాను " అని పరాంకుశం నోటికి వచ్చినట్లు చెప్పాడు . పరాంకుశం కి బామ్మ వుండటము , ఆమె మునుల గురించి చెప్పటం అనేది నిజం . పారంకుశానికి ఒక

మాయ చెప్పు దొరకటమే అతడు నోటికి వచ్చినట్లు చెప్పిన మాట .

"దీనికి నేను ఒప్పుకోను - నీకు "దొంగ"అనే శిక్ష వేస్తాను " అని కలెక్టర్ గారు తీర్మానించారు .

అప్పుడు గుడి ట్రస్టీ గారు లేచి " దణ్ణాలు దొరగాబు, ఆలాంటి పని చేయొద్దు . ఈ ఎంక్వయిరీ ఆధారంగా మాగుడి ప్రతిష్ట మరియూ  ఇన్కమ్ ఇబ్బడి ముబ్బడి గా పెరిగేట్లు వున్నది .  ఈ ఎంక్వయిరీ రిపోర్ట్ ను టైపు చేయించి మీసంతకం పెట్టి ముద్ర వేసి ఇప్పించండి . మిమ్మలని పరాంకుశం గారినీ బంగారు పూల మాలతో సత్కరిస్తాము " అని విన్నవించాడు .
బామ్మ మాటల్ని ఎదో అడ్డం కోసం వాడుకున్న పరాంకుశం చివరికి బంగారం మూట కట్టుకున్నాడు ,

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ

## 12.మోకాళ్ళకి ఏమి పని వున్నది? 22-06-24

కృష్ణ మూర్తి గారి ఇంటి తలుపు కొట్టాను . అయన భార్య తలుపు తీసి "అన్నయ్యగారా ? రండి . కూచోండి అయన పైకి వెళ్లారు . ఒకటి రెండు నిమిషాల్లో వస్తారు " అని చెప్పి తాను లోపలికి వెళ్లి పోయింది .
ఆమె చెప్పిన పైకి అంటే ఏమిటో నాకు తెలుసు . కృష్ణ మూర్తి గారిది నాలుగు అంతస్థుల మేడ . అయన చల్ల గాలి పీల్చాలని ఆ నాలుగో అంతస్థు పైకి వెడుతూ ఉంటాడు . ఇప్పుడు అయన వెళ్లిన "పైకి" అనే చోటు నాలుగవ అంతస్థు యొక్క టాప్ అన్న మాట .
కృష్ణ మూర్తి గారు మెట్ల గది లోనుండి బయటికి వచ్చాడు . మేము మాటల్లో పడ్డాము.
" మీకు అసలే మోకాళ్ళ నొప్పులు కదా ? నాలుగవ అంతస్థు దాకా మెట్లు ఎందుకు ఎక్కుతున్నారు ? ఎందుకు దిగుతున్నారు ? ఉన్న ఆ కాస్త మోకాలి చిప్పలు అరిగి పోయి బెజ్జాలు పడతవి " అని నేను ఆయనను స్నేహ పూర్వకంగా మందలించాను .
ఇందుకు అయన "అలాగా ఏమీ కాదులెండి .నేను సులువు బరువు చూసుకుంటూనే పైకి వెడతాను- వస్తాను . పై నుండి కిందకు ఒక తాడు వ్రేలాడ తీసుకున్నాను . పైకి వెళ్లే టప్పుడు ఆ తాడు పట్టుకుని -

పాక్కుంటూ పైకి పెడతాను . కిందకు వచ్చే టపుడు మెట్ల మీద నుండీ దొర్లుకుంటూ కిందకు వస్తాను . ఇందులో నా మోకాళ్ళకి ఏమి పని వున్నది చెప్పండి?  . ఏదైనా పనిని మనము సులువు బరువు ఎరిగి చేసుకోవటం లోనే అంతా వున్నాది "  అన్నాడు .

అయన ఏమి సుళువులు కనిపెట్టినాడో ఆయనకే తెలియాలి . అంతే నా  ? లేక మీకేమన్న తెలుసునా ?

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క  స్వంత రచన

**11.** పిచ్చ క్లారిటీ వచ్చింది **... 17-06-24**

అది 1987 .మా అత్తారి ఇంటిలో వున్నాను . మా అత్తారింటికి  పడమర దిక్కున పిచ్చయ్య శాస్త్రి గారు అని ఒకాయన ఉండేవారు . ఏదన్నా తింగరి విషయములో గట్టి క్లారిటీ దొరకాల్సి వచ్చినపుడు - లేదా ఉత్తుత్త క్లారిటీలు కావాల్సి వచ్చినపుడు నేను ఆయన తో కూచుని   చెర్చ చేసే ది  అలవాటు  .అదే నా అత్తగారి ఇంటిలో నాకున్న కాలక్షేపం.

నేను ఆయనతో మాట్లాడుతూ "సంక్రాతి అనగా రైతుల పండగ . వారి పాలిట సిరి సంపదలు ఐన ధాన్యపు రాసులు ఇంటికి చేరే పండగ .ఇలా అని నాకు క్లారిటీ వున్నది . మా మామగారికి పాడీ పంటలు ఏమీ లేవు . మరి నన్నెందుకు పిలిచాడో ?
ఏమిటోనూ?? . మీరేమని క్లారిటీ ఇస్తారు? " అని నేను ఆయనను అడిగాను .

" కాదు కాదు సంక్రాంత్రి అనేది అల్లుళ్ళు ఇంటికి వచ్చే పండగ " అన్నాడు ఆయన ." మరి అందరికీ అల్లుళ్ళు రాక పోవచ్చు .అందరికీ అల్లుళ్ళు ఉండక పోవచ్చు . కానీ అందరూ కూడా పండగ చేస్తున్నారు కదా?అదెట్లా ?" అని అడిగాను .

"అయితే విను . ఒకరికి ఆడపిల్ల వున్నది . కానీ ఆ పిల్లకు ఇంకా పెళ్లి కాలేదు . కాబట్టి  అల్లుడు లేడు. పిల్లకు పెళ్లి అయ్యింది . కానీ అల్లుడు అలిగాడు . పండుగకు రాలేదు .ఏరకంగా నైనా సరే అల్లుడు పండగకు రానప్పుడు , మేనల్లుళ్లను తెచ్చుకొని పండగ జరుపుకోవాలని శాస్త్రము లో  క్లారిటీ వున్నది  . ఇక  మేనల్లుళ్లు కూడా లేనివారి గురించి కూడా శాస్త్రము ఆలోచించింది . వారు తమకు

ఇష్టమైన యువకులకు పట్టు బట్టలు పెట్టి - మా ఇంటికి మా మేనల్లునిలాగ వచ్చి పండగ చేసుకొని వేళ్ళ మని ఆహ్వానించాలి . అసలు పిల్లలే లేని వారు ఉంటే - పరాయి వారి కూతురిని అల్లుడిని ఇంటికి పిలిచుకు వచ్చి పండగ చేసుకోవాలని . శాస్త్రము క్లారిటీ ఇచ్చింది . శాస్త్రము ఇంతగా చెప్పటం చూస్తే సంక్రాంతి అనగా అల్లుళ్ళ పండగ నే అని నిర్ధారణ అవుతున్నది . మీ మామగారు నిన్ను పండగకు రమ్మని ఎందుకు పిలిచారో ?అనే దానిపై నీకు ఇప్పుడు క్లారిటీ వచ్చిందా లేదా ?" అని ఆయన అడిగాడు .

" నాకు పిచ్చ క్లారిటీ వచ్చింది . కానీ ఇంకో విషయము వుంది . స్వాతంత్రము వచ్చినా కూడా స్వాతంత్రము వచ్చి నట్లు లేదని అనేక మంది సినీ కవులు పాటలు రాసారు . మనకు స్వాతంత్రము వచ్చినట్టా ? రానట్లా ? అది కూడా క్లారిటీ
ఇవ్వగలరు " అని నేను అడిగాను .

" . ఆగస్టు పదిహేనుకు సెలవు ఇస్తున్నారు కాబట్టి మనకు స్వాతంత్రము వచ్చింది అనే అనాలి . కానీ శాస్త్ర ప్రకారము చూస్తే మనకు స్వాతంత్రము రాలేదు అని కూడా అనాలి. ఒక వేళ వచ్చి ఉంటే --మనకు

స్వాతంత్రము  వచ్చిన ఘడియలు, విఘడియలు, తిధి వారము, నక్షత్రమును బట్టి , పంచాంగము ప్రకారము ప్రతి సంవత్సరమూ స్వతంత్ర దినోత్సవమును నిర్వహించుకుంటూ ఉండేవారం .  మనకు ఎందరో సాంప్రదాయ  , అతి సాంప్రదాయ  ,"ఘన ", "ఘనా ఘన" సంప్రదాయ వాదులు వున్నారు . వారెవరూ కూడా -- స్వతంత్ర దినోత్సవాన్ని  పంచాంగము ప్రకారము జరుపు కోవాలని డిమాండ్ చేయకుండా ఆగస్టు పదిహేను తోనే సర్దుకు పోతు న్నారు . ఈ సర్దు బాటు ను బట్టి  మనము ఇంకా కూడా ఆంగ్ల యుల ప్రభావం నుండి బయట పడి న స్వతంత్రులము         కాలేదని తెలుస్తోంది . మనము పంచాంగము ప్రకారము   స్వాతంత్ర దినోత్సవము జరుపుకునే  వరకూ మనకు ఇంకా సంపూర్ణ స్వాతంత్రము రానట్లే అనాలి . ఎలావుందీ నా క్లారిటీ ?" అని ఆయన అడిగాడు .

"మీ రిచ్చిన క్లారిటీతో నాకు పిచ్చ క్లారిటీ వచ్చేసింది " అని నేను చప్పట్లు కొట్టాను ,

" పిచ్చి వారి ముందు ఆలా చప్పట్లు కొట్ట రాదండీ ..'అంటూ మా అవిడ వచ్చి  నన్ను ఆపింది .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి - స్వంత రచన .
{నేడు మా పెండ్లి రోజు ఆయిన సందర్భంగా ఈ తింగరి రచన . నా పెండ్లి 1987 లో నేను అతి బాల్య ములో ఉండగా అయ్యింది - అందుకని క్లారిటీ లు అడుగుతూ ఉండేవాడిని }

**10- 47** గురు అనాధ యోధులు . **10-06-24**

ఒక అమావాస్య చీకటి రాత్రి పూట 46 మంది యోధులు ఒక కోట గోడపైకి పాకుతూ వున్నారు . ఒక గంట మోగగానే చటుక్కున కోట లోపలి కి దూకి ఆ కోట లోని వాడిని మట్టు పెట్టాలని వీరి వ్యూహము .
వీరు ఎవరు ? అనుకుంటున్నారా ?ఎవరంటే - ఒక చెక్రవర్తి వున్నాడు . అయన ముఖ్య సేనాని పేరు కీరా - ఇతడు చెక్రవర్తి కి ముఖ్య అనుచరునిగా మెలుగుతూ - చెక్రవర్తి పేరున తానే రాజ్యము చేస్తూ వున్నాడు . చెక్రవర్తి గారు ఒకసారి ఒక చిన్న రాజుగారి ఆహ్వానము మన్నించి ఆయనను ను సందర్శించ తలిచి -కీరా ని పిలిచి "నీవువెళ్లి నాకు కావాల్సిన ఏర్పాట్లు అన్నీ కూడా చూడు "అనే ఆజ్ఞ వేసి రాజు వుండే రాజ్యానికి పంపాడు .

రాజు గారి  దెగ్గరికి వచ్చిన వారిని ఆహ్వానించి మర్యాద చేయవలసిన భాద్యత -   "అసానో" మరియూ "కామాయి సమా"  అనే ఇద్దరు యోధుల  మీద వున్నది .  చెక్రవర్తి మరియూ అతనితో కలసి  వచ్చిన పెద్దలకు ఎలాంటి మర్యాదలు చేయాలో అనే సంగతులు చూడటానికే కీరా వచ్చాడు కాబట్టి అసానో మరియూ కామాయి సమా -- ఇద్దరూ కూడా కీరా యొక్క  ఆజ్ఞలు పాటించ వలిసి వచ్చింది .

చక్రవర్తి తరుఫున వస్తున్న అధికారులకు జరగబోతూ వున్నా మర్యాదలను పరిశీలించిన కిర  - కోపం తో రెచ్చిపోయాడు . ఏర్పాట్లు సరిగా లేవని ఎగిరాడు . తన కింద పని చేయటానికి ఇవ్వ బడ్డ మన ఇద్దరి యోధుల మీదా ఎగిరి గంతులు వేసాడు .

కిరా  చేతిలో ఎదురవుతున్న అవమానాలను తట్టుకో లేని కామాయి  - కీరా  ను చంపి పడేద్దాము అనే ఆలోచన దాకా వెళ్ళాడు .  అప్పుడు అసానో " వద్దు కోపము తగ్గించుకో " అనికామాయికి  శాంతి బోధ చేసాడు . ఇక్కడ వున్నా అసలు సంగతి ఏమిటంటే  కిరా  తాను చక్రవర్తి తరఫున వచ్చాను అన్న గర్వముతో రాజు  కింద ఉన్న  వారినందరిని బెదిరించి - భయపెట్టి - తనకోసము అని కానుకలు లాంఛనాలు లంచాలు పుచ్చుకుంటూ వున్నాడు .ఇది రాజు కు కూడా తెలుసు . కానీ ఏమీ చేయలేని వాడు అయ్యాడు .

మన యోధులు ఇద్దరూ ఏమీ సమర్పించ క పోవటాన , కిరా - వీరి మీద అగ్గి పిడుగు ఐ పడుతున్నాడు - అదీ సంగతి . అసానో మంచి యవ్వనంలో వున్నవాడు . ఎంతో ఓర్పు వున్నవాడు . కానీ ఇతడి ఓర్పు కూడా నశించి పోయే రోజు వచ్చింది . ఒకానొక శుభసమయాన, కిరా -- అసానోని ఉద్దేశించి " పెంటదిబ్బ మీద కాసిన బూడిదగుమ్మడికాయ నీకంటే నయము" అని తిట్టి అవమానించాడు . దీనిని విన్నవెంటనే కామాయి కోపం హద్దులు దాటి పోయింది . కానీ ఈ లోగా , శాంతి కాముకుడు అయిన అసానో నే కత్తి దూసి కీరా మీద పడ్డాడు . కిరా చావు తప్పించుకుని - కన్ను లొట్టబోయి నట్లు అంటే కంటి ప్రాంతములో - ముఖము పై ఓ పెద్ద గాయముతో బ్రతికి బయట పడ్డాడు .

చక్రవర్తి తరఫున వచ్చిన మనిషి మీద కత్తి దూయటము అంటే మాటలా ? చెక్రవర్తి కే గాయం జరిగినంత హంగామా అయ్యింది . జరిగిన సంగతి ఎట్లా వున్నా కానీ రాజ భవనంలో ఒక చట్టము వున్నది . అదేమిటంటే - రాజ భవనంలో కత్తి తో తిరగ వచ్చు కానీ - ఆ కత్తిని బయటకు లాగ కూడదు అన్నదే ఆ చట్టము .

ఈ చట్టము ఆధారముగా కిరా రాజును వత్తిడి పెట్టి - ఈ చట్టాన్ని ఉల్లంఘించి నందుకు గానూ అసానోకి మరణ శిక్ష విధించమని కోరాడు . అసానో కి 34 యేండ్లు. రాజు గారు అసానోకి "సెప్పుకు" అనే మరణ శిక్ష వేసాడు . "సెప్పుకు"

అంటే తన కత్తితో తానే పొడుచుకొని చని పోవాలి లేదా చని పోయే దాకా పొడుచుకోవాలి .

జమీందారు ఆజ్ఞ మేరకు అసానో మరణించాడు .ఇతడి కుటుంబానికి ఏమి ఆధారము లేకుండా పోయినది . వారు వీధుల్లో పడ్డారు . అసానో రాజు గారి కింద వున్న చిన్న సేనాని . అతనికింద 47 మంది ఉప సేనానులు, 320 సైన్యము వున్నారు .

కిరా మీద జరిగిన హత్యా ప్రయత్నానికి గానూ అసానోను చక్రవర్తి ముందు ప్రవేశపెట్టి ఉంటే - అప్పుడు చక్కని విచారణ జరిగి-- కీరా యొక్క లంచగొండి తనం బయట పడి - అసానోకి క్షమా బిక్ష దొరికి ఉండేదని, కానీ కిరా కావాలనే రాజు ను తొందరపెట్టి అసానోకి మరణ శిక్ష పడేట్లు చేసాడని - తన తరఫు వాదము చెప్పుకునేందుకు అసానోకి ఎటు వంటి సహజ న్యాయము లభించలేదని - అసానో కింద పని చేసే 47 గురు ఉప సేనానులు అనుకున్నారు. వీరు జరిగిన దానికి ప్రతీకారము తీర్చుకోవాలి అనుకున్నారు . ఈ 47 మంది యోధులూ కూడా యజమాని లేని వారి అయినారు కాబట్టి వీరిని "అనాధ యోధులు " అని ప్రజలు పిలిచారు . ఆనాటి పద్ధతి ప్రకారం ఇలాంటి అనాధ యోధులు దేశము మీదకు చెల్లా చెదరు అయి పోవాలి లేదా విషము మింగి చని పోవాలి . కానీ ఈ 47 గురు యోధులూ , తాము బ్రతికే వుండాలని , తమ యజమానికి జరిగిన అన్యాయానికి గానూ

, కిరా  మీద ప్రతీకారము తీర్చుకోవాలని రహస్య ప్రతిజ్ఞ తీసుకున్నారు .  లంచగొండి  కిరా -- అనేక బందో బస్తుల మధ్య తన ఇంటికి వెళ్లి , ఇంటిలోనే  దాక్కున్నాడు .

47  మంది అనాధ యోధులకు నాయకుడు -యోషియో లేదా యోషి.  ఇతడు కీరా మనుషులు అజాగ్రత్తగా వ్యవహరించే దాకా ఎదురు చూసాడు . ఈలోగా మిగిలిన 46 మంది యోధులూ మారు వేషాలలో  చిన్న చిన్న ఉద్యోగాలలో చేరారు .  వీరిలో ఒకడు కిరా నివాసము ఉంటున్న బంగ్లా పక్కనే  వున్న ఇంటి వారి అమ్మాయిని ప్రేమలో పడేసి ఆమెను  పెండ్లి చేసుకున్నాడు . అతడు ఆ ఇంటికి   అల్లుని హోదాలో వస్తూ  పోతూ  - కీరా ఇంటి బయటా - లోపలా ఉన్న కాపలాలోని  గుట్టు మట్లు అన్నీ తెలుసు కున్నాడు . ఆపై ఇల్లు కట్టిన తాపీ మేస్తులకు లంచాలు ఇచ్చి  ఇంటి  లోపల  ఏ గది  ఎక్కడ  వున్నదీ? ఎటు నుండి ఎటు దారులు వున్నవి అనేది కూడా తెలుసుకుని ఆ వివరాలు కాగితము మీదకు ఎక్కించి పెట్టాడు .

47  మంది అనాధ యోధులకు నాయకుదాగు  - యోషి- ఒక తాగు  బోతుగా మారి వ్యభిచార గృహాల వెంట తిరిగి - తాను పనికి మాలిన వెధవగా మారినట్లు అందరికీ భ్రమ కల్పించాడు .  ఒకనాడు యోషీ  . తాగి  రోడ్డు మీద పడి దొర్లుతున్నట్లు నటిస్తూ ఉండగా - కిరా మనిషి ఒకడు వచ్చి ఇతడిని చూసి -

ఏమీ భయ పడకుండా ఇతని దగ్గరికి వెళ్లి - యోషి మొహం మీద ఉమ్మి వెళ్ళాడు .అప్పుడు యోషీ కేరింతలు కొట్టుకుంటూ , మరింతగా దోర్లాడు . ఇలాగా అతడు- కీరా మనుషులకు తాను అంటే భయము లేకుండా ఉండేంత గొప్ప నటన చేసాడు .

ఒక మంచుకురిసే రాత్రి లో అనగా December 14, 1702, మన 46 గురు అనాధ యోధులు - కిరాను హత్య చేసే ప్రయత్నం మీద బయలు దేరారు . కీరా ఇంటి పక్కన ఇంటి వారికి అల్లుడూ --తమలో 47 వ వాడూ అయిన వాడికి తాము వస్తున్న సంగతి తెలిపారు .

.అల్లుడి ని మినహా మిగిలిన 46 గురూ, కిరా ఇంటి చుట్టూ పక్కల వారిని కలిసి తాము చేయబోతున్న దాడిగురించి చెప్పారు . అసానో అన్యాయంగా చావుకు గురి ఐనాడని ప్రజలు కూడా నమ్ముతూ నే వున్నారు . అందువల్ల వారు అనాధ యోధాదులకు వత్తాసుగా నిలిచారు సాయం అందించారు .

46 అనాధ యోధాలలో కొందరు కోట గోడలు ఎక్కి అక్కడి కాపలా దారుని చంపి వేసి - . కోట తలుపు లు తెరిచారు .ముందుగా అనుకున్నట్లు గంటను మోగించారు. కింద ఉన్న వారు మంచు మీదగా కోటలోనికి పరి గెట్టారు . అందువల్ల వారి అడుగుల శబ్దం ఎవరికీ వినపడ లేదు .

అనాధ యోధులు ప్రతి గదినీ వెతుకుతూ ముందుకు పోతూ ఉండగా - కిరా ప్రమాదం పసిగట్టి -- ఒక్క గోచీ గుడ్డ మాత్రమే ధరించి . పరుగు పరుగున పోయి , నల్ల బొగ్గు దాచి ఉంచి న గదిలో ని నల్లని బొగ్గుల మధ్య దూరాడు . వంటినిండా బొగ్గు మసి పూసుకున్నాడు . అందువల్ల కీరా అతి నల్లని చీకటిలో అతి నల్లని మనిషిగా మారి పోయాడు .

కానీ నల్లని కీరా ముఖము మీద - కంటి పక్కన లోతైన తెల్లని చార మాత్రం - బొగ్గుమసితో కప్పబడి పోకుండా స్పష్టంగా కనపడుతూనే ఉంది .ఈ మచ్చ అసానో తన కత్తి తో కిరా మీద దాడి చేసినపుడు ఏర్పడిన మచ్చ . యోషీ -వద్ద, అసానో -- కిరా ను చంపుదాము అని బయటకు లాగిన కత్తి వున్నది . అతడు దానిని బయటికి తీసి కిరా కు ఇచ్చి " నిన్న నీవు చంపుకో " అని ఆజ్ఞ వేశాడు . కానీ కీరా కు అంతటి ధైర్యము లేక ,. భయముతో వణికి పోయాడు . ఇక కాలాతీతము అయిపోతూ వున్నదని భావించిన యోషీ - కీరా తలను నరికి తీసుకున్నాడు .చివరికి అసానో కత్తి - అస్సానో తరఫున కిరా ను చంపి ప్రతీ కారం తీర్చు కున్నట్లు అయ్యింది .

అందరూ కోట లో నుండి బయట పడ్డారు . 46 మంది లో 46 మందీ లెక్క తేలారు . అందరూ ఎంతో కొంత గాయ పడి వున్నారు. అందరూ కలిసి కిరా తలను వూరేగించుతూ తీసుకెళ్లి - ఒక సరస్సు వద్ద పెట్టి దానికి తలంటి నీళ్లు పోసి

దాని మీద మసిని తొలగించారు . ఆపై తీసుకు వెళ్లి - అస్సాకు సమాధి వద్ద, అతని కాళ్ళ వద్ద పడవేశారు . ప్రజలు జయ జయ ధ్వానాలు చేశారు . 46 గురూ ఎక్కడికీ పారిపోకుండా - సైన్యము వచ్చి తమను బందిస్తుందని ,మరణ శిక్ష వేస్తుందని ఆసిస్తూ, ధైర్యంగా ఆ సమాధి వద్దనే కూచున్నారు.

సైన్యము వచ్చి ఈ 46 గురిని బంధించింది . అల్లుడిగా మారిన యోధుని సంగతి ఎవరూ బయట కి పెట్టలేదు . కాబట్టి వీరు 46 మంది . కానీ వీరి ఖర్మ వేరుగా వుంది . కిరా గాడి సైనికులు వీరిని భందింది నాలుగు గ్రూప్ లుగా విడదీసి వేరే వేరే రాజ్యాలకు పంపి అక్కడి రాజులకు వీరిని బానిసలుగా వాడుకొండి అనే ఆజ్ఞ ఇచ్చారు . వీరి తరలింపు కార్యక్రమం ప్రజలందరి దృష్టిలో పడి వీరికి " యానామాని మరణం పట్ల న్యాయమైన ప్రతీకారం తీర్చుకున్న యోధులుగా " కీర్తి ప్రతిష్టలు వచ్చాయి . చక్రవర్తి ఏ ఈ విషయాన్నీ స్వయంగా విచారించి - వారికి క్షమా బిక్ష పెట్టాలని ప్రజలు నినాదాలు చేసాబు.

కానీ చెక్రవర్తి బదులు, చెక్రవర్తి దర్బారు వారు విచారణ జరిపి February 4, 1703, న ఈ యోధులకు " మీకు మీరుగా పొట్టలలో పొడుచుకొని చనిపోండి" అనే మరణ శిక్షని వేశారు . ఇది బానిసత్వముకంటె మరీ ఘోరం కదా ?

ఇప్పటికి ఈ 46 మండియోధులు తమకు కేటాయించబడిన రాజుల వద్ద కు చేరి బానిసలుగా వున్నారు . చెక్రవర్తి వద్దనుండి ఏదన్న క్షమా బిక్ష వస్తుందేమోనని ఈ నలుగురు రాజులు కూడా ఎదురు చూసారు అనగా రాజులకు కూడా వీరి మీద సానుభూతి వున్నది . చెక్రవర్తి క్షమించినట్లు వార్త ఏమీ రక పోవటంతో ఈ 46 లో 45 మందీ ఆత్మ హత్య లు చేసుకున్నారు . 46 గురిలో - అస్సనో యొక్క కొడుకు 16 ఏండ్ల చిన్న వాడు కూడా వున్నాడు . ఇతడు చిన్న వాడు కాబట్టి అనే దయతో అతనికి మాత్రము చక్రవర్తి క్షమా బిక్ష ఇచ్చి, కొన్ని భూముల ను కూడా ఇచ్చి - " రేపు చని పోతాను అని నీకు తోచిన ముందురోజున నిన్ను నీవు హత్య చేసుకోవాలి " అనే శిక్షను వేసాడు . చనిపోయిన 45 గురిని , వారి యజమాని ఐన ఆసాకు-- సమాధి చెంతనే నే పాతి పెట్టారు .

ఈ అనాధ యోధుల నాయకుడు యోషీ తాగుబోతుగా నటిస్తూ వీధులలో పొర్లినది - ఒకరి వచ్చి అతడి ముఖాన ఒకరు ఉమ్మి వేసినది మీకు గుర్తు ఉన్నదా ? వాడి పేరు సత్సుమ . ఇతడు వచ్చి ఈ వీరులకు తాను చేసిన అవమానాన్ని గుర్తు చేసుకొని విలపించి - ఆ సంగతులు ప్రజలకు కూడా చెప్పి - పాస్చాత్తాపముతో అక్కడికక్కడే ఆత్మ హత్య చేసుకున్నాడు . అప్పుడు వీడితో కలిసి మొత్తము 46 సమాధులు ఏర్పడ్డవి .

అసానో కొడుకు  85 ఏండ్ల వరకూ బతికి - ఆపై తనను తాను చంపుకొన్నాడు .ఇది ౪౭వ యోధుడు . తండ్రి లేని అనాధ . ఇతనిని కూడా 46 సమాధుల వద్ద పాతి పెట్టారు . ప్పుడు మొత్తము  47  మందిఅయినారు . వీరు అందరూ సమురాయి జాతి వారు-  జపనీయులులకు ఎంతో గౌరవనీయులు .

ఈ కధలో కొన్ని తేదీలు కూడా వున్నవి - అనగా ఇది జపాను లో జరిగిన నిజమైన చారిత్రిక గాథ . వీరి సమాధులు- వీరి విగ్రహాలు నేటికీ  కూడా వున్నవి . కష్టాలు ఎదుర్కోవటానికి గానూ తమకు శక్తిని ఇవ్వమని కోరుతూ ప్రజలు వీరికి పూజలు కూడా చేస్తారు .

ఇది జపాను జనులకు ఎంతో ప్రేరణ ఇచ్చిన కథ . ఇద్దరు ముగ్గురికన్నా ఎక్కువ మంది కలిసి చేసే పని సహజముగా విజయవంతము కాదు . కానీ 47 గురు కలిసి చేసిన పని విజయ వంతము అయింది , అంటే వ్యక్తుల మధ్య ఎంత సహకారము ఉండి ఉందో   ?  సంకల్ప బలము ఉంటే వంద మంది కలిసి అయినా సరే కలిసి ఒకే పిట్టను కొట్టవచ్చు .

సత్సుమా - అదే ఉమ్మి వేసినవాడు గుర్తున్నాడా ? అతడు పశ్చాతాపముతో చని పొయినాడని అనుకున్నాము కదా ? అది ఏమి పాస్చాత్తాపము ? అంటే - తాగి నేలమీద పడి దొర్లుతున్న మనిషిలోని శత్రువును గుర్తించలేక పోయినాడు కదా ? . అలాగా యజమాని ప్రాణాల మీదకు తెచ్చాడు .

ఇతడి  పాస్చాత్తాపము తన వైఫల్యము ము గురించి అన్న మాట .

రచన సమర్పణ వారాణసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి

ఇది జపాను భాషనుండి పలు భాషలోకి వెళ్లి పలురకాల సీరియల్స్ , వీడియో గేమ్స్ , నాటకాలు , సినిమాలుగా మారిన కథ .




ABOVE IS THE STATUES OF THE 47 RONINS



ABOVE IS KILLING OF KIRA BY ASANO




**ABOVE THE GRAVE YARD OF 47 R0NNINS**




# ABOVE - WHERE KIRA HEAD IS WASHED




**HIS SON WHO ESCAPED DEATH**

**9. " సరే కట్టారా దండగ  "        7-06-24**

నేనూ మావాడు ఒకడు బండి మీద ఎక్కి,  ఢిల్లీ పురవీధులకుండా వెడుతున్నాము .ఎవడో ఒక ట్రాఫిక్ పోలీస్ మమ్మల్ని ఆపాడు .   మీ దగ్గర అదుందా ?

ఇదుందా ? అని అడుగుతూ మా ఆధార్ కార్డు చూసి " ఏమిటి మీరు ఆంధ్రులా ? అని ప్రశ్నించాడు . ఆపై " నేనూ ఆంధ్రుడనే జాబ్ మీద ఇక్కడికి వచ్చాను " అని జవాబు చెప్పాడు . " సంతోషం .. అయితే వెళ్లి పోతామండీ . మాకు జరూరు పని వున్నది" అని నేను అన్నాను . " అన్ని కాగితాలూ సరిగానే వున్నాయి, కానీ మీరు వెళ్ళటానికి వీలు లేదు .దండుగ కట్టి వెళ్ళండి " అని అతడు అన్నాడు . " ఏమి నష్టము అయ్యిందని మేము దండుగ కాట్టాలె " అని నేను ప్రశ్నించాను . అప్పుడు వాడు అన్నాడు " పైన చూసారా ఒక విమానము విమానాశ్రయము వైపుకు పోతూ వున్నది . మీవాడు ఆ విమానాన్ని ఓవర్ టేక్ చేయటానికి ప్రయత్నించక ,నింపాదిగా పోతూ వున్నాడు . ఏది కనపడితే దాన్ని ఓవర్ టేక్ చేయకుండా బండి తోలటం ఆంధ్రుల కీర్తికి నష్టము - . మన కీర్తికి లోటు కలిగించే పని చేసి నందుకని మీరు దండుగ కట్టాల్సిందేను " "అబ్బాయి ఇవ్వరా ఓ వంద " అని నేను అన్నాను . " మీరు, మన ఆంధ్రులు అపర దానకర్ణులు , అన్న కీర్తికి కూడా లోపం తెప్పి స్తూ వున్నారు .ఒక్క ఐదొందలకు తక్కువ గా ఏ ఆంధ్రుడు అంగీకరించడు. మీరు ఇచ్చేది చూస్తే మీరు మన ఆంధ్రులకి గర్వభంగము చేస్తూ ఉన్నట్లు వుంది " అని అతడు

అన్నాడు . " మనకు ఎందుకు గర్వ భంగము జరగాలి ? సరే కట్టారా దండగ " అని నాజేబులోవి ఐదు వందలు తీసి మా వాడికిచ్చాను . వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత రచన .

మనము ఆంధ్రుల గౌరవము నిలపెట్టటానికి అని ఇస్తాము పుచ్చుకుంటాము

**8.**మహా మంత్రి మక్కెన మాణిక్యమ్మ **06-06-24**

మాణిక్యమ్మ గారు ఇండిపెండెంట్ అభ్యర్థిగా పోటీచేసి ఎంపీ గా గెలుపొందారు . పైన ఉన్న అధికార పార్టీ వారు - మెజారిటీకి కావాల్సిన సీట్లలో 99 .99 %పర్సెంట్ తెచ్చుకున్నారు . ప్రతి పక్షం వారు కూడా 99 .99 %పర్సెంట్ సీట్లు తెచ్చుకున్నారు . అప్పుడు మాణిక్యమ్మ గారి ఇండిపెండెంట్ ఓటుకు మహా ప్రాధాన్యత వచ్చింది .

"నాకు మహా మంత్రి పదవి ఇస్తే మీకునా మద్దత్తు ఇస్తాను " ఈమె చెప్పింది .

"మహా మంత్రి పదవి చందమామ కథలలో నే ఉంటుంది కానీ రాజ్యాగం లో లేదు " అని ఆమెకు నచ్చచెప్పి " మంచి మంత్రి పదవి ఇస్తాము - దాన్ని "మహా చేసుకో"

అని ఉద్భోదించారు . ఈమె దానికి ఆమోదించగా వారు ఆమెను పెట్రోలియం శాఖా మంత్రిని చేశారు .

పదవి చేపట్టగానే మహా పనుల మీద ద్రుష్టి పెట్టింది మాణిక్యమ్మ గారు .
ముందుగా తన శాఖ అధికారులను పిలిపించి -" గిన్నిస్ బుక్కులో పట్టే గ్యాస్ సిలిండర్ తయారు చేయండి " అని ఆజ్ఞ వేసింది . అధికారులు దాన్ని తయారు చేయించి ఆమె వాకిటి ముందు పెట్టారు . అది పొడుగులో ధ్వజ స్తంభము అంత ఎత్తు వుంది . రెగ్యులేటర్ భూమికి నడుమెత్తున ఉండేట్లు ఏర్పాటు చేశారు .అందులో త్రి ఇన్ వన్ కనెక్షన్ కి వీలుంది . అంటే ఒక కనెక్షన్ మామూలు వంట స్టవ్ కి , రొండోది వేన్నీళ్ళకు, మూడో కనెక్షన్ మహా స్టవ్ అనే ఒక స్టవ్ తయారు చేసి దానికి ఇచ్చారు .మహా స్టవ్ బర్నర్లు కారు టైర్లు అంత వున్నాయి , దాని మీద లారీ టైరు లంతా వెడల్పున్న గిన్నెలు పడతాయి .
ఈ మహా సిలిండర్ ని చూడటానికి స్త్రీలు వారి భర్తలతో సహా తండోప తండాలుగా వచ్చారు. మాణిక్యమ్మ గారు తోటి మహిళా మణుల పట్ల ఆదరణ చూపించి - వారి ని మర్యాద చేయటానికి అని పెద్ద గుండిగను మహా స్టవ్

మీదకు ఎక్కించి అందరికీ కాఫీలు కాచి ఇచ్చారు . . ముప్పది సెకన్ల లోపల  పాలు కాగి కాఫీ రావటం చూసి మహిళలు ముక్కున వేలు వేసుకున్నారు . బడికి పోయే పిల్లలు అటు ఇటూ పోకుండా ఇటుగా వచ్చిసిలిండర్ ని చూసి పోవటం అలవాటు చేసుకున్నారు . పిల్లలు వచ్చారు కదా ? అని మాణిక్యమ్మ గారు చిప్స్ - కారప్పూస వంటివి మహా స్టవ్ మీద వండించి పిల్లల సంచుల్లో పోయించింది  . కార పూసా బూందీ వంటివి మహా స్టవ్ మీద,  జేసీబీ చక్రాలంత భాండీలలో, నిమిషానికి నాలుగు బస్తాలు గా తయారు అయినవి . ఇట్లాగే సాయంత్రము పూట వచ్చిన పిల్లలకు పాలకోవా బిళ్ళలు - పకోడీలు తయారు చేయించి పెట్టించింది. ఈ మహా సిలిండర్ మహా వంట పాత్రలు - మహా స్టవ్ ని చూపిస్తాము అని చెప్పి ఆటో వాళ్ళు,  రిక్షా వాళ్లు యాత్రికులను తీసుకొని మాణిక్యమ్మ గారి ఇంటి చుటూ తిప్పారు . దేశము లోని ఎక్కడెక్కడి యాత్రికులు వస్తూ వున్నారు కాబట్టి వారి గౌరవర్ధము అని - మాణిక్యమ్మగారు - మధ్యాన్నాము మరియు సాయంత్రము పూట ల - సమోసాలు పూరీలు చేయించి పెట్టించింది  . మహా భాండీలలో నిమిషానికి 500 సమోసాలు మూడు వందల పూరీలు వేగినవి . పూరీలని

దేవి బయటికి తీయటానికి అని చిన్న జేసీబీ ని పెట్టారు . అది పూరీలను నూనెలో గోలించి బయటకు తీసేది . పూరీ కూరకు అని ఇంకో బుల్లి జేసీబీ ని పెట్టారు . అది గంగాళం లోనుండి కూరను తీసి ప్లేట్ లో వేస్తుంది . పందిరి భోజనాలు పెట్టే వారు తన మహా స్టవ్ ని మహా గాస్ సిలిండర్ ని , మహా వంట పాత్రలు వాడుకోవచ్చని మాణిక్యమ్మ గారు ఆర్డర్ ఇచ్చారు . దీనితో వూరిలో అన్నదానాలు పెరిగాయి. అన్నాలు తిన్న జనము "మహా తల్లి , మహా ఇల్లాలు" అని ఎలుగెత్తి అరిచారు. పెట్రోలియం శాఖా మంత్రిగా -ఉన్న మాణిక్యమ్మ గారు అడిగిన వారికెల్లా - గాస్ డిస్ట్రిబ్యూషన్ ఏజెన్సీ - పెట్రోల్ బంకు లు ఇచ్చారు. రోడ్డు పక్కన గ్యాస్ సిలిండర్లు అమ్మారు . మనిషికి ఇన్నిఏ సిలిండర్ లు అనే నియమము ఎత్తేసారు . ఇలా ఎన్నో మహా మంచి పనులు చేసిన మాణిక్యమ్మ గారు, ఇటు పత్రికల వారితోను .అటు టీవీ ల వారితో నూ మహా మంత్రి గారు అని పిలిపించు కున్నారు . ప్రజలు ఆమెను మహా మంత్రి గారు అని వ్యవహరిస్తూ ఉన్నందున మేము ఆమెను మహా మంత్రి అని సంభోదించాము అని టీవీ ల వాళ్ళు భుజం తడుముకున్నారు . ఎలాగైతే నేమి ? " మహా

మంత్రి "అన్న పదవి - మాణిక్యమ్మ గారికి ,  దక్కింది . ఆ పదవిని ఇహ ఎవరూ పీకలేరు అనుకుందాము .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క స్వంత రచన

**7,**నందుని కథ   **4-06-24**

నందుడు - బుద్ధుని తండ్రి ఐన శుద్ధోదన మహారాజు కి రెండో భార్య ఐన  ప్రజాపతి గోతమి యొక్క పుత్రుడు . శుద్ధోధనుని మొదటి భార్య ఐన  మహా మాయ యొక్క పుత్రుడు బుద్ధుడు .  { పాళీ భాష లో సుద్ధోధనుడు అనగా - పరిశుభ్రమైన  వరి   పంటను పండించు వాడు అని అర్ధము}

ఈ రకంగా నందుడు బుద్ధుడు అన్న తమ్ములు . ప్రజాపతి గోతమి, బుద్ధుని  పెంచిన తల్లి మరియూ , బౌద్ధ దీక్షను స్వీకరించిన మొదటి మహిళ .  నందుడు బుద్ధుడు ఒకే రక్తము నుండి జన్మించిన వారు అయినప్పటికీ - నందుడు పుట్టుకతోనే -  బుద్ధునికన్నా - నాలుగు వేళ్ళ= అనగా బెత్తెడు చిన్న దేహము  కలవాడు

. ఈ రకంగా నందుడు బుద్ధుని కన్నా కొంచెము తక్కువ స్థాయి వాడు అని నిరూపిస్తారు . నందుడు తన పూర్వపు జన్మలో ఒక తాబేలుగా వున్నాడు . ఇహ బుద్ధుడు కూడా - తనకు వున్న ఇంతకు ముందటి జన్మలో ఒక నది దాటుటకు గానూ వేచి చూస్తూ వున్నాడు . అప్పుడు , ఈ తాబేలు వచ్చి, బుద్ధుని వీపు పైన ఎక్కించుకుని నదిని దాటించింది . దీనికి ప్రత్యుపకారంగా బుద్ధుడు తాబేలుకు మోక్షం ఇవ్వదలిచాడు . అందువలన తాబేలు నందుని గానూ బుద్ధునికి తమ్ముడిగానూ పుట్టింది .తాబేలుకు మోక్షము { అనగా మరుజన్మలు లేకుండా కల్పించుతాను }- అని బుద్ధుడు నిర్ణయించుకుని ఉన్నందున - బుద్ధుడు నందుని వెంట పడీ మరీ అతనిని మోక్ష మార్గమునకు మళ్లించి నాడు , { ఇది నంద సుత్తము అనే గ్రంధము ప్రకారము }
నందుడు సాధారణ సంసారిక జీవితము గడుపుతూ వున్నాడు , అతని భార్య ఐదు భారత దేశముల లో వున్నా అందగత్తెలకన్నా అందగత్తె .ఆమె మోహములో ఉన్న నందునికి బుద్ధుని పట్ల నమ్మకము ఏదీ లేదు . ఏదో మాటవరసకు బుద్ధుని శిష్యత్వము స్వీకరించాడు

అంతే . నందుని ప్రవర్తన చూసి బుద్ధుడు అతనిని మోక్ష మార్గములోకి మళ్లించటానికి పూను కున్నాడు .

ఈ కధ జరుగు సమయానికి -----
బుద్ధుడు ఆనందుడు అనే శిష్యుని తో కలిసి - నందుని గృహము ఉన్న ప్రాంగణములో ని ఒక కుటీరములో ఉంటూ వున్నాడు . ఒకనాడు బుద్ధుడు భిక్షాటనకు బయలు దేరాడు . ఇది చూసిన నందుడు పరిగెతుకుకు వచ్చి బుద్ధుని భిక్షా పాత్రను ఆహార పానీయాలతో నింపి వేసాడు . బుద్ధుడు వాటిని తిరస్కరించి "నీవు సంసారిక జీవితం వీడితేనే నేను నీ బిక్ష స్వీకరిస్తాను " అని అన్నాడు . ఇంతలో నందుని భార్య " త్వరగా రండీ" అని భర్తను కేక వేసి పిలిచింది . నందుడు భార్య మాటను తిరస్కరించి - బుద్ధుని వంక తిరిగి " నేను ఆమె మాట ను తిరస్కరించాను - కనుక నన్ను నీ శిస్యునిగా స్వీకరించు " అని కోరాడు .
"భార్య పిలుపు/ ఆహ్వానాన్ని మన్నించని వాడు సన్యాసి గా మారినట్లే .కాబట్టి నీవు నా శిష్యుడవు అయినావు" అని బుద్ధుడు ఆనందుడు ఇచ్చిన భిక్ష స్వీకరించాడు. అతనికి బుద్దిస్టులు ధరించ వలసిన వస్త్రాలను ఇచ్చాడు ." శిరః ముండనం చేయించుకుని ఈ దుస్తులు ధరించు "

అని ఆజ్ఞ ఇచ్చాడు .కొన్ని రోజుల పిమ్మట నందుడు బుద్ధుని ఏమార్చి తన భార్య వద్దకు పో చూసాడు .కానీ నందుడు తన ఇతడు ఇంటి గుమ్మము చేరుతూ ఉండగానే - తలుపులు వాటి అంతట అవి గా మూసుకున్నవి . ఇంకో తలుపు తెరుచుకుంది . నందుడు అందులోనుండి లోనికి ప్రవేశించాడు . అతని వెనకనే ఆ తలుపు కూడా మూసుకున్నది . మరొక తలుపు తెరుచుకున్నది . కానీ నందుడు బయటికి పోలేక పోయాడు . అప్పుడు బుద్ధుడు ఆనందునికి ప్రత్యక్షం అయినాడు . నందుడు తిరిగి బుద్ధుని కుటీర ప్రవేశం చేసాడు .
నందుడు తన భార్య యొక్క ఆలోచనలను వీడక " బుద్ధుడు ఎదో కొద్ది సమయం పాటు బయటకు వెళ్ళినపుడు కాక -- అయన దీర్ఘ కాలము పాటు బయటకు వెళ్ళినపుడు - నేను నా భార్య కోసము వెళ్ళటం మంచిది" అనే నిర్ణయము తీసు కున్నాడు . కొంచెము ఎక్కువ సమయము వెచ్చించ వలసిన పని మీద బుద్ధుడు బయటికి వెడుతూ ఉండటం గ్రహించిన నందుడు - ఇదే అదనుగా వెళ్లి తన భార్యను చూడాలనే తలంపులో పడ్డాడు . కానీ బుద్ధుడు వెడుతూ వెడుతూ " "నందా - ఈ ఆశ్రమ ప్రాంగణాన్ని శుభ్రము చేయి " అని

ఆదేశించి వెళ్ళాడు . త్వరగా శుభ్రము చేసి భార్య చెంతకు చేరుదామని నందుడు పనిలో వేగం పెంచాడు . అతడు అంతా శుభ్ర పడింది అనుకున్నాక - సుడి గాలి వీచి - ఎక్కడెక్కడి చెత్తా వచ్చి ఆశ్రమ ప్రాంగణములో పడింది. . ఈలోగా బుద్ధుడు తిరిగి విచ్చేశాడు .భార్యను చూడాలన్న నందుని కోరిక నెరవేరలేదు .

ఇలాగే మరో సారి కూడా నందుని చేతికి చీపురు అందింది ."ఈ చిమ్మే పని ని పక్కన పారవేసి ముందు గా భార్యను చూసి వస్తాను " అని నందుడు నిర్ణయం తీసుకున్నాడు . ఆవెంటనే నందుడు వెనక్కి వెనక్కి చూసుకుంటూ ముందుకు కదిలాడు . ఒకసారి వెనక్కి చూడగా బుద్ధుడు తిరిగి వస్తూ కనపడ్డాడు . నందుడు తటాలున ఒక చెట్టు మాటున దాగాడు . అప్పుడు ఆ చెట్టు - కూకటి వేళ్ళతో సహా గాలిలోకి లేచి నందుడిని బుద్ధునికి చూపించింది. నందుడు ఆశ్రమానికి తిరిగి రాక తప్పలేదు .

" నీకు నీ భార్యను మించిన స్వర్గాన్ని చూపుతాను " అని చెప్పిన బుద్ధుడు నందుని వెంట పెట్టుకొని -- Trayastrimsa అనే స్వర్గములోకి ప్రవేశించాడు .{ దేవతలకోసము ఉన్న 33 స్వర్గాలలో ఇది దేవతలకు అతి ఇష్టమైన స్వర్గము } దేవతలు దేని నుండి

ఆనందమును గ్రోలుతున్నారో దానిని- బుద్ధుడు నందునికి చూపించాడు . చూపించి "  ఇప్పుడు నీవు నీ మరణాంతర జీవితమును ఎలా గడప దలిచావో అనే దానిపై  నిర్ణయము తీసుకో "అని భోద చేసాడు ." నా మూర్ఖత్వము అర్ధము అయింది , నేను నీతో పాటుగా మోక్షమునకు ఇష్టపడతాను" అంటూ  నందుడు బుద్ధుని శరణు వేడాడు .

Trayastrimsa అను స్వర్గము లో ఉండగా నందుడు" దేవా నాకు ఈ స్వర్గములో 500 మంది దేవతాస్త్రీలు కనిపిస్తూ వున్నారు . అందరూ . మంచి ఆభరణములు ధరించారు . ఒక్క పురుషుడూ లేడు.  ఈ స్వర్గములో ఈ దేవతా స్త్రీలు మాత్రమే ఎందుకున్నారు ? పురుషులు ఎందుకు లేరు ? అని అడిగాడు .అప్పుడు  బుద్ధుడు పిలవగా ఒక దేవతా స్త్రీ ముందుకు వచ్చి "భూలోకములో నందుడు అనే వాడు ఒకడు వున్నాడు . అతడు "సంసారిక జీవితమును విడిచి పుచ్చటం" అనే మంచి పని చేసినందున  అతడు ఈ స్వర్గమునకు రానున్నాడు . అతడే మా అందరి పాలిట పురుషుడు  కాగల వాడు అని భావించి న ,  ఈ స్వర్గముపు  పురుష దేవతలు మమ్ము  విడిచి ఏటో పోయినారు " అని చెప్పింది.

ఇది విన్నాక నందుడు -- " ఈ అందగత్తెల ముందు నా భార్య కోతి వంటిది అని భావించి భార్య ను గురించిన ఆలోచనలు మాని వేసాడు . బుద్దుడి ఆజ్ఞ్యలను పాలించి ఈ స్వర్గమును చేరుకోవాలని నిర్ణయము తీసుకున్నాడు .

వెనుకకు తిరిగి వచ్చునప్పుడు బుద్ధుడు నందుని చే నరక దర్శనము చేయించాడు.  భూమి అంచుల వెంబడి వున్న ఇనుప కొండల మధ్య నరకము వున్నది . ఆ కొండలకు అవతల కోతులను పోలిన సుందరీ మణులు అగు యువతులు   నివాసం వున్నారు . వీరిని చూసిన నందుడు " నా భార్య వీరికన్నా అందగత్తె నే - కానీయవ్వనంలో  నా భార్య వీరికి సాటి రాదు " అన్నాడు.

"ఇందాక చూసిన దేవతా స్త్రీలను   ఈ కోతి జాతి వనితలతో పోల్చితే నీకు ఏమి అనిపిస్తున్నది? " అని బుద్దుడు అడిగాడు .  "ఆ దేవతా స్త్రీలను ఈ కోతి రూపపు వనితలతో పోల్చటమా ?" అని నందుడు నివ్వెర పడ్డాడు . ఆపై నందుడు బుద్ధుడు నరకం లోపలికి వెళ్లారు . మనుషులను ఉడికించుటకు , వేయించుటకు గానూ నరకము ఏర్పరుచుకున్న అనేక వంటపాత్రలను  - నందునికి చూపి వాటి ని పరిచయం చేసాడు బుద్ధుడు  .

అన్ని పాత్రల లోనూ నీరు తెర్లుతూ ఉన్నది .
అందులోపల  వున్న మనుషులు కూర ముక్కల వలెనూ అన్నము వలెనూ ఉడుకుతూ వున్నారు .నూనె నిండిన పాత్రలో వున్న మనుషులు కూర ముక్కల లాగా వేగుతూ వున్నారు . ఇది చూసి నందుడు భయపడి పోయాడు .

 ఇంతలో   బాగా ఉడుకుతున్న ఒక వంట గుండిగ నందుని దృష్టిలో పడ్డది ."దీనిలో ఎవరూ లేరు కదా ? దానిని ఎందుకు అట్లా వుడికిస్తున్నారు " అని నందుడు -ఆ వంట మండుతున్న యమ కింకరుడిని  అడిగాడు .
" అవును. భూలోకములో నందుడు అని బుద్ధుని శిష్యుడు ఒకడున్నాడు .వాడు బౌద్ధ సన్యాసిగా మారటం లో ఉన్న ప్రయోజనాలను విస్మరిస్తూ వున్నాడు . బుద్ధుని బోధనలు వినకలిగినందుకు గానూ అతనికి లభించే స్వర్గ నివాస కాలము ముగిసి  పోగానే - ఆ నందుడు ఆ  స్వర్గము నుండి జారి నేరుగా దీనిలోకి పడి పోతాడు . అతడు ఏ క్షణమైనా రావచ్చును కనుక , మేము ముందుచూపుగా ఆ నందుని కొరకు   గుండిగ లోని నీటిని వేడి  చేస్తూ వున్నాము " అని వాడు బదులు ఇచ్చాడు .

అపుడు నందుడు " నన్ను తిరిగి భూలోకములో ప్రవేశపెట్టు. నాకు స్వర్గము ఇవ్వక పోయినా గానీ ఈ నరకము ను మాత్రము ఇవ్వవద్దు " అని తధాగతుని వేడుకున్నాడు .
నందుడు మరియూ బుద్ధుడు భూలోకానికి తిరిగి వచ్చారు . తిరిగి వచ్చునప్పుడు వారు , వారు సూన్యము కుండా ఏడూ రోజుల పాటు ప్రయాణించారు . ఈ ప్రయాణములో - బుద్ధుడు - బౌద్ధ సన్యాసం స్వీకరించటంలో గల ప్రయోజనాలను గురించి నందునికి సమగ్రంగా వివరించాడు . అప్పుడు నందుడు బౌద్ధ మార్గము పట్ల నూరు శాతమూ నమ్మిక కల వాడు అయినాడు . అలాగా ఈ కథ ముగిసింది- కథ ముగిసినది కానీ నందసుత్తము వేరుగా రాయ పడుతుంది .

ఈ కథను మీకు అందించిన ది వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .



చిత్రములో వున్న ది - 1నందుని రూపము- 2 వింజామర వేయించుకుంటూ వున్న ది- శుద్దోధన మహారాజు. 3. బిడ్డను అంకము పై కూర్చుండ పెట్టుకున్న ది నందుని కి తల్లి - బుద్ధునికి పినతల్లి అయినా గౌతమి .

**6.**ఐదు భారత దేశాలు**-** ఐదు పేర్లు **2-06-24**

చైనా వారు భారత్ నుండి వచ్చిన బుద్దిస్టు లను ఆదరిస్తూ , వారు ఎచ్చటనుండీ వచ్చినది ? తెలుసుకుంటూ వున్నారు. బుద్దిస్టులు చెప్పిన దానిని పట్టి భారత దేశము అంటే ఐదు దేశాల కలగలుపు దేశమని చైనీయులు భావించారు . ఐదు దేశాలు కల భూమి ఇండియా అని చెప్పటానికి గానూ వారు ,

Wǔtiānzhú (五天竺, = "Five Indias"అనే మాటను వారి భాషలో కల్పించుకున్నారు.  ఈ మాట ఏ వారి అభిప్రాయానికి  సాక్షం.   ఈ నమ్మకానికి  కారణము, ఆనాటి   చైనా వారికి భారత దేశములో కల వేరు వేరు రాజ్యాల  గురించి ఏమీ అవగాహన లేక,  భారత దేశము ఐదు దేశాల కూర్పు అని భావించారు . అవి  . 01 .మధ్య భారత దేశము . 02 . తూర్పు భారత దేశము , 03. పశ్చిమ భారత దేశము , 04 .ఉత్తర మరియూ 05 . దక్షిణ భారత దేశము.   చీనీ సాహిత్యము భారతదేశపు బుద్ధిస్టుల చెరిత్రను గ్రంథస్థము చేసే టపుడు  " ఐదు భారత దేశములలో ని అందగత్తెలను మించిన అందగత్తె " అనే మాటను వాడింది .

ఇప్పుడు నేను పోస్టు లో రాసిన చైనీస్ మాట కూడా ఇంటర్నెట్ నుండి సేకరించినదే . ఇలా చూసినపుడు కూడా భారత దేశము అంటే ఐదు దేశాల కలగలుపు అని చైనీయులు నమ్మినట్టు రుజువు అవుతున్నది . .నేడు కూడా మనము ఉత్తర భారత దేశము దక్షిణ భారత దేశము అనే మాటలను వాడుతూ  వున్నాము . ఇది చైనా వెళ్లి తిరిగి వచ్చిన బుద్ధిస్టుల ప్రభావమే కావచ్చును . ఉత్తర భారత దేశము దక్షిణ భారత దేశము అని

పలికినపుడు,  మనము కూడా భారత దేశమును  రెండు దేశముల కింద ప్రస్తాపించినట్లు అవుతున్నదని కదా ? ఇలా వ్యవహరించటం మనకు  బుద్ధిస్టుల ద్వారా  పట్టు బడింది ?.

ఆకాలము నాటి చైనీయులు సూర్యునిని బట్టి భారతదేశాన్ని నాలుగు దిక్కులకు నాలుగు భాగాలుగా విడదీసి విడతీయటానికి కుదరని ప్రాంతాన్ని మధ్య భారత దేశము కిందకు మార్చారు .

మరొక విషయము - మన భారత్ కి ఐదు వ్యవహార నామాలు వున్నాయి . ఒకటి ఆర్యావర్తము {ఆర్యుల భూమి అని } రెండు  Tenjiku {తెంజుకూ , అనేది అతి ప్రాచీన మైన జపాను పదము --దీని అర్ధము ఇండియా స్వర్గము "అని }, మూడు - భారత్ ,  నాలుగు హిందుస్తాన్ , ఐదు  Al-Hind { ఆల్ హిందు-- ఈ మాట భారత దేశముతో వర్తకము చేసే అరబ్బీలు వాడారు . బ్రిటిష్ వారు భారత్ ని ఆక్రమించినాక - వారు భారత్ ని బ్రిటిష్ ఇండియా అని వ్యవహరించారు . మనకు బ్రిటిష్ వారి పాలన రాక ముందు మనకు ముస్లింలు కూడా పాలకులు గా వున్నారు కదా ? అందువల్ల వారు బ్రిటన్

పాలనకు ముందు వున్న భారత్ దేశాన్ని గురించి చెప్పటానికి అని అరబ్బీలు ఆల్ హింద్ {=స్వతంత్ర గణతంత్ర రాజ్యము } అనే మాటను వాడారు

ఇది కేవలము విషయ పరిజ్ఞ్యానము కోసమే అని మనవి . -

సేకరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ amaravathi

**5.**కరణమయ్య **29--5-24**

ఒక పల్లెవాడి దృష్టిలో కరణీకం చేసే అయ్యగారే కరణమయ్య గారు . కరణముల చేతిలో పల్లెల పాట్లు అందరికీ తెలిసినవే . అందరికీ పాట్లు కలిగించటం వల్లనే వారి దుకాణాలను బందు వేశారు .
ఒక సారి నేను మావూరి కరణము దెగ్గరికి వెళ్ళాను . నా అర్జీ ఎదో ఆయనకు ఇవ్వవలసి వచ్చి . అయన ఎంతకూ నావైపు చూడలేదు . చూచాక ఎంతో తట పటాయింపుతో నా కాగితము పుచ్చుకొని " ఈ సంతకము ఎవరిదీ ?" అని దీర్ఘం దీసాడు . నాదేను అన్నాను . ఏమి చదివావు అన్నాడు . టెన్త్ అన్నాను . టెన్త్ చదివినందుకే సంతకము పెడుతున్నావా ? వేలిముద్ర వేయి . అన్నాడు . వేలికి

రాసుకోవాల్సిన కాటుక కోసం ఇంటికి పరిగెత్తాను . నేను తిఱిగి వచ్చే సరికి అయన లేడు .పొలం కొలతలకు వెళ్ళాడు అన్నారు . రేపు రమ్మన్నారు .
మా కరణమయ్య గారి మహత్యంలేదా లీలల  వలన ఒక రైతు భూమి ఎవరిదో అయ్యింది . భూమి పోయిన  రైతు యొక్క బావుమరిది ఒక పిచ్చి వాడు . వాడు బావతరఫున రంగ ప్రవేశం చేసాడు .
వాడు పొద్దున్నే నిద్రలేస్తూనే భజన చెక్కలు వాయించుకుంటూ కరణం గారి ఇంటి ముందుకు వెళ్లి "కరణమయ్యా -- శరణమయ్యా" అని అరగంటపాటు కుప్పి గంతులు వేసాడు .రామభజన చేసే ఆంజనేయునిలా .అప్పుడు కారణంగారి భార్య బయటికొచ్చి ముగ్గులు వేసి  ." వేళా గానీ వేళా , ఈ తెల్లారురుఝామున , నువ్వేడివిరా శనిలా వచ్చావు ? అని తిట్టింది . ముగ్గు వేయకమునుపు ఎవరినీ తిట్ట  గూడదు అని ఆమె నమ్మిక .అందుకని ముగ్గులు వేసాక ఓపిక చేసుకొని తిట్టింది .  వాడు అక్కడ నుండీ బయట పడ్డాడు .
నేరుగా వెళ్లి గుడిముందు నిలుచొని "కరణమయ్యా  మాకు శరణ మయ్యా మా మాయ్యా " అని భజన చెక్కలు మోగిస్తూ గంతులు వేసాడు ."  రామయ్యా శరణ మయ్యా "  " శివయ్యా శరణు"  అని పాడే దానికి  బదులు  ఇట్లా ఎందుకు పాడుతున్నావురా ? అని రామాలయపు పెద్దలు అడిగారు .

వీడు అక్కడనుండి కూడా బయట పడ్డాడు .అప్పటికి ఉదయం ఎనిమిది తొమ్మిది మధ్య  అవుతూ వుంది . రైతులు పొలం పోతూ వున్నారు . వీడు వాళ్లకి ఎదురు వెళ్లి - నిట్టనిలువుగా వాళ్ళ కాళ్ళ మీద పడి - "కరణమయ్యా - శరణమయ్యా కాదంటే మాకు మరణమయ్యా " అని పలికి భజన చెక్కలు మోగించాడు. వారు విస్తు పోయారు.వీడెవడో కానీ కారణానికి భలే చాకి రేవు పెట్టాడురా అనుకున్నారు . ఇంకొంచెం సేపటికి ఆడవారు ,  మేతలకోసమని  బర్రెలను తోలుకుంటూ పొలాలకు పెడుతూ వున్నారు . వీడు బర్రెల వెంట పడి - అవి తోక ఎత్తినపుడల్లా "కరణమయ్యా - శరణమయ్యా " అని అరిచి భజన చెక్కలు మోగించాడు . బర్రెలు దౌడు తీసి ఏటో పారి పోయినవి .  పారి పోనివి , ఎదురు వచ్చే వారిని కొమ్ములతో కుమ్మి నవి. కుమ్మంలో కుండలిని కుమ్మినట్లు .
ఈ అల్లకల్లోలం తరువాత వాడు బడుల కు వెళ్లే పిల్లల   వెంట పడి "కరణమయ్యా - శరణమయ్యా "అని ఆడుతూ పాడుతూ వాళ్ళ వెనుక నే  స్కూల్ కాంపౌండ్ లోకి వెళ్ళాడు . "ఎదో ఉపద్రవం వచ్చిందిరా అయ్యా " అన్నట్లు స్కూల్ మాస్టర్లు స్పందించారు .
పై తదుపరి వీడు పోస్టాఫీసుకి. అక్కడనుండి బ్యాంకు కి వెళ్లి ఒక్కో చోటా పావు గంట చొప్పున "కరణమయ్యా - శరణమయ్యా "అని ఆడుతూ పాడుతూచెక్క భజన చేసాడు .

అది ఎంతో రక్తి కట్టిందని పోస్టు మాస్టారు అన్నాడు . ఫిక్సడ్ డిపోసిట్స్ ఎగిరి పోయినవాని బ్యాంకు అయన అన్నాడు . ఇలాంటి భజనలు రెండు మూడు రోజులపాటు నిరాకటంకంగా జరిగినాక --
ఎవరీ పిచ్చి వాడు ? ఎక్కడినుండీ వచ్చాడు ? ఈవూరి వారిలో వీడి వారు ఎవరు ? అనే ప్రశ్నలు పుట్టి - ఈ పిచ్చి వాడి బావగారి యొక్క జాడలు తెలిసాయి .
ఆ రైతు వచ్చి " కరణం కారణంగా నా పొలం పోయిందనే బెంగతో నేను చని పోతానని - దానితో వాడి అక్క గారి పసుపు కుంకాలకు లోటు వస్తుందనినే పిచ్చి ఆలోచన వచ్చి పిచ్చి పట్టింది .వీడు మొదలే పిచ్చివాడు .ఇప్పుడు ఆ పిచ్చి ముదిరింది -అలా వీడు డబల్ పిచ్చి వాడైనాడు" అని వివరణ ఇచ్చాడు .
విషయము ఊరంతా తెలిసినాక కరణము గారు ఎంతో టెన్షన్ ఫీల్ అయినాడు . తాటి పండు రాలి నెత్తిన పడినట్లు భాద పడినాడు . ఇదిగాక కరణము గారి భార్య "కరణమయ్యా - శరణమయ్యామా పాలిట మరణమయ్యా " అనే భజనను ఓ సుప్రభాతం లాగా వినటానికి ఏమాత్రం ఇష్టపడలేదు . ఇహ వూరిలో ని ఆడవారుకూడా " కరణము గారు తమ పొలాలని తద్వారా తమ పసుపు కుంకాలని ఎలా హరించ బోయినాడో అనే విషయాల ని ఊహాతీతంగా ఊహించి చెప్పుకొని కాలక్షేపం చేశారు.ఈ ముచ్చట్లకు అంతూ దారీ లేకుండా

పోయి నాయి . ఇవి  కూడా కరణం గారి భార్య చెవిన చేరాయి .అప్పుడు ఆమె చెవునుండి రక్తము కూడా కారింది అంటారు .

చివరికి కారణము గారు ఎదో ఒకటి చేసి - రైతు కోల్పోయిన పొలాన్ని తిరగి అతని పేరు మీదనే రికార్డులలో తిరగ రాసాడు . దీనితో "కరణమయ్యా - శరణమయ్యా" అనే భజన ఆగిందా ? అంటే అదేమీ లేదు . వాడి భజ న అదే విధముగా మూడునెలలు కొనసాగింది .ఇది తట్టుకోలేక, ఈ లోగానే కరణం ఊరినుండి పారి పోయినాడు .ఇంకెక్కడో మకాం పెట్టినాడు .కరణం వెళ్ళిపోయినాక ,  ఆపై పిచ్చి వాడు ఎమైనాడో  ఎవరికీ తెలియలేదు ." ఆ  పిచ్చోడిని - గుంటూరు పెద్దాసుపత్రిలో చేర్చినాము - మొదటి పిచ్చి తగ్గినది .రెండో పిచ్చి  అట్లాగే వున్నది . "కరణమయ్యా - శరణమయ్యా మా పాలిట మరణమయ్యా " అనుచునే వున్నాడు  " అని ఆ రైతు అడిగినవారికి సమాధానము ఇచ్చాడు .

వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

4. ఆర్థికాలలో / ఫైనాన్స్ లో  **-- ఎలుక ?   20-05-24**

ఆర్థికాలలో ఎలుక అని రాస్తే చదివిన దానిలో 0.01%  దీని ని చదువుతారు అనుకుంటూ మొదలేస్తాను,

ఏదేశములోనైనా సరే ఈ రోజులలో ఉన్నటువంటి ఇన్వెస్టర్, ల పరిస్థితి ఏమిటో చూద్దాము .

బ్యాంకింగ్ వ్యవస్థ అనేది ఒక ఎలుకల బోను అనుకోండి . మీరు అక్కడి వడ్డీ కోసం అని అందులోకి దూరితే, మీకు ఎదో కొంత లాభం దొరుకుతుంది . ఎరగా పెట్టిన వడ్డీ అయినా తినగలుగుతారు . ఎలుక తిన్నాదా ? లేదా అన్నది ఎవరికీ ముఖ్యము కాదు .ఎలుక కోసం అని ఎదో ఒకటి తెచ్చి ఎరగా ఉంచ వలసి రావటమే బ్యాంకులకి వచ్చే కష్టము .

ఎలుక అనే ఇన్వెస్టర్ రాక పోతే పోతే బ్యాంకు అనే బోను యొక్క ప్రయోజనము సూన్యము . ఎలుక లోపలే వుంది. అది ఎరను తిని బొర్రపెంచుకుంటూ ఉంటే బ్యాంకుకు ఏమి లాభము . మీకు వడ్డీ ఇవ్వటం అనేది లేకపోతే -- అదే వారి లాభం కదా ? అదే వారికి సుఖ జీవితం కదా ?

చివరికి ఏమిటంటే , ఎర అన్నది చాలక , ఎలుక ఆకలికి మాడి చచ్చి పోతే ఆ పాపం బోను పెట్టిన వారిదా? కాదా ? ఆపై ఆ ఎలుక కుళ్ళిన కంపు అందరికీ వస్తుంది . అద్నదరూ ముక్కులు మూసుకుంటారు అనగా విమర్శిస్తారు . ఇది ప్రభుత్వాలకు అవసరమా ?

"ఇళ్లే" -- అవసరం లేదు . అదే మిమ్మల్ని పిల్లి అనే అనే ఆర్థిక నేరగాళ్ల నోటిలో పడేస్తే ?? మీరు అనగా ఎలుకలు దాని పొట్ట లోకి పోయి మాయం అవుతాయి . ఎలుక కంపు కొట్టటం అనేదే లేదు . అంటే అంతా మంచిగా వున్నట్లే ఉంటుంది .

బ్యాంకులజోలికి పోకుండా జీవితం గడిపే వీలుంది అని మీరు గుర్తిస్తారు . అది నగదు లావాదేవీలు . దీనికి ప్రభుత్వములు పెట్టె బోను "డిజిటలు మనీ ". ఈ బోను ద్వారా మీరు వెళ్లి పిల్లి నోట్లోపడేట్లు చేయటమే ఎకానమీ ఎక్సపెర్టిజము అంటే .

అనేక ప్రభుత్వాలు, ఎలుక కోసము అని ఒక ఎరను  బోనులో ఉంచటానికి ఎందుకు దడుస్తున్నాయి ? దానికి కారణము??  అమెరికా వారి ఆర్థిక విధానాలు దీనికి కారణము .

.బ్యాంకులు  మీకు వడ్డీ ఇస్తూ కూచుంటే - అమెరికా డాలర్ కిందకు మీదకు ఎగరటం వల్ల - మీకు ఇచ్చిన వడ్డీ ప్లస్ ఖర్చులకు సరిపోనూ బ్యాంకులకు ఆదాయం రాక పోవచ్చు . ఎప్పుడేమి గతి ? అప్పుడు పారిశ్రామిక వేత్తలు అనే వందలాది పందికొక్కులు చనిపోవచ్చు ? ఆ చావు కంపు నేతలకు నచ్చదు .

అమెరికా మీద నాకు ఏమీ వ్యతిరేకత లేదు . వ్యతి రేకత ఉన్న అయన ఎవరన్నా వున్నారు అంటే అయన రష్యా అధ్యక్షుడు పుతిన్ . ఆయన అమెరికా దేశము "డాలర్ అండర్ మైనింగ్ "కి పాల్పడుతున్నదని ఆరోపించాడు . అనగా అమెరికా కావాలనే తన డాలర్ విలువ తగ్గించుకుంటూ పోతున్నది అన్నాడు.

అది ఎలాగో చూద్దాము .<>రష్యా యుక్రేన్ యుద్ధము వల్ల - యుక్రేన్ అమెరికాకి ఎటువంటి ఎగుమతులూ చేయ లేదు కదా ? . కాబట్టి అమెరికా తనకు కావాల్సిన వి యుక్రేన్ చుట్టూ పక్కల నుండీ కొనుక్కొని . వారికి ధారాళంగా డాలర్లు చెల్లిస్తున్నది .కావాలని తన డాలర్ విలువను తగ్గించుకొని, డాలర్ ఇవ్వాల్సిన చోట రెండు డాలర్లు ఇస్తున్నది . యుక్రేన్ వద్ద తప్ప చుట్టూ పక్కల అంతా డాలర్లు కుప్ప తెప్పలుగా జమ అవుతున్నాయి . ఈ సందర్భంగా అమెరికా యుక్రేన్ తో ఏమని అనవచ్చును అంటే " మా డాలర్ల విలువ పడి పోయింది . నువ్వు ఇంతకు ముందు వంద పెట్టి కొన్న ఆయుధము ఇప్పుడు రెండు వందలు అయ్యింది . కొనుక్కోతలిస్తే కొనుక్కో . కొనుక్కోలేను, యుద్ధము చేయలేను అంటావా ? నువ్వట్లా తోలు బొమ్మలా గా కూచో ,, మేము రాజ్యము చేసి యుద్ధము గెలిచి చూపిస్తాము " అని అంటుంది .

"డాలర్ డీ మైనింగ్" ద్వారా ద్వారా అమెరికా ఏదేశాన్నిఅయినా బోల్తా కొట్టించవచ్చు .యుక్రేన్ యుద్ధములో వుంది కాబట్టి దానికా పాట్లు రావచ్చు

. మరి ఇతర దేశాలసంగతి ఏమిటండీ అంటే ? ఎన్నో పరిశ్రమలు అమెరికన్ టెక్నాలజీ మరియూ మిషినరీ మీద ఆధారపడి మనుగడ సాగిస్తూ వుంటాయి .అమెరికా చిన్న దేశాలనుండి తనకు కావాల్సిన పదార్థాలు సేకరించుకుని వారికీ రెట్టింపు లెక్కన పే చేస్తున్నది . ఈ దేశాలవారు కూడా, ఈ డాలర్లు తీసుకొని మాకు మెషినరీ ఇవ్వండి అని కోరుతూ అమెరికా వెంటపడుతున్నారు . ఇలాంటి స్థితిలో అమెరికా "భారత్ తో " నువ్వు రెట్టింపు ధరకు నా మెషినరీ కొనుక్కో - పరిస్థితులు అలావున్నాయి . లేదంటే ఆ పరిశ్రమ నాకు అప్పగించు - నేను నడిపి చూపుతాను " అంటుంది . {ఇది కేవలం ఉదాహరణకు}

అలాగా - భారత్ లో ని ఒక పరిశ్రమ వుండటమా పోవటమా అనేది అమెరికా చేతుల్లోకి పోతుంది . చూస్తూ చూస్తూ ఉండగానే ఎవరో తన్నుకు పోయే భారత పరిశ్రమకి లోన్లు ఇచ్చి - వాటినుండి వడ్డీ/ లాభం రాబట్టి - దానిలోనుండి ఓ భాగాన్ని మీకు ఎవరు ఇస్తారు చెప్పండి ?

ఇలాంటి ప్రాసెస్ లో ఎవరికీ చెడ్డ పేరు రాకుండా ఉండాలంటే ఇన్వెస్టర్ అనే ఎలుక వెళ్లి -- సైబర్ / డిజిటల్ / ఆన్ లైన్ మోసాలు అనే పిల్లి నోట్లో పడటమే మంచిది కదా ? పిల్లి లోకి అరిగి పోయిన ఎలుక ఏమన్నా కంపు కొడుతుందా ? కంపు కొట్టక పోవటమే అందరికీ మంచిది కదా ? పిల్లి ఎలుకను తినాల్సిందే అన్నది ఒక న్యాయము కదా ?

మే 07 -2024 నాటి రాయిటర్స్ వార్త ప్రకారం -, May 06 - చైనా ప్రెసిడెంట్ Xi Jingping పారిస్ నుండి మాట్లాడుతూ - ఒలంపిక్ క్రీడా ఒప్పందాల మాదిరి గా - అన్ని దేశాలు ఒక ఒప్పందానికి వచ్చి - " ఎవరి కి దమ్ము వుంటే వారు క్రీడా పతకాలు గెలుచుకోవచ్చు అన్నట్లుగా, ఎవరి కి దమ్ము వుంటే వారు ఇతర దేశాల పరిశ్రమలను స్వాధీనము చేసుకోవచ్చును" అని ఒక ఒప్పందానికి కనుక వస్తే - అమెరికా ఆటలు కట్టు తవి - పరిశ్రమలు చక్కగా నడుస్తవి - బ్యాంకు ఇన్వెస్టర్లకు చక్కని వడ్డీ

దొరుకుతవి అని ప్రవచించారు . పుతిన్ దీనికి అంగీక రించారు .



French President Emmanuel Macron and Chinese President Xi Jinping attend the sixth meeting of the Franco-Chinese Business Council at the Marigny Theater in Paris, France, May 6, 2024. REUTERS

s

రష్యా కూడా ఆయుధ బలానికి తోడు ఆర్థిక బలాన్ని కూడా కోరుకుంటున్నట్లు వుంది .

అమెరికా బదులు చైనా వారు పరిశ్రమలను స్వాధీనము చేసుకోవటం మొదలెడితే చైనా యొక్క యెన్ బలపడి అమెరికా డాలర్ బలహీన పడుతుందని- చివరికి తనదే రాజ్యము అవుతుందని చైనా ఊహిస్తూ వున్నది

ఆర్థికంగా బలహీన మైన అమెరికా చేతుల్లో ఉన్న యుక్రేను , వేరే గతి లేకతనకి లొంగి పోతుందని -- రష్యా ఆసిస్తూ వున్నాయి .

చాలా పెద్ద ఆర్థిక విషయము . కుదించి రాసిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి .

3.ఆర్ధిక నేరాలకు ఆవలంబన 18-05-24

డబ్బు పరమైన మోసాలకు లోను అయ్యే వారిలో భర్తలేని వారు భర్త నుండి విడి పడిన వారు , రిటైర్ మెంట్ అయినా వారు ఎక్కువగా వుంటారు అని గణాంకాలు వున్నవి .
ఎదో ఒకటి రొండు పెర్సెంట్ ఎక్కువ వడ్డీకి ఆశపడి న వీరు తమ పొదుపు మొత్తాలను మోసగాళ్ల చేతుల్లో పెడతారు . ఎదో ఒక సంస్థను సృష్టించి , మోసపూరిత వాగ్దానాలతో సొమ్ము కాజేసే వారు వుంటారు . వీరిని గుర్తించటానికి - చట్టానికి చిక్కించటానికి వీలు వుంది . అందువల్ల నేటి రోజులలో వీరే ఆన్ లైన్ మోసగాళ్లుగా మారుతున్నారు . వీరు, ఎవరికీ చిక్కని విధంగా సాఫ్ట్ వెర్ లింకుల తోటి తమ కార్యాకలాపాలు అనగా మోసాలు చేస్తూ వుంటారు .

ఆన్ లైన్ మోసగాళ్లు ఎదో ఒక యాప్ ద్వారా, ఫోనులో మాత్రమే సంప్రదింపులు చేస్తారు . మీరు ఏమాత్రము ఆసక్తి కనపరిచినట్లు కనిపించినా - మీకు రోజుకు పది సారులు ఫోన్ చేసి. మీరు ఎదో మంచి ఇన్వెస్ట్మెంట్ అవకాశాన్ని - అజ్ఞానము కొద్దీ వదులు కుంటున్నారు

అనే భ్రమ కల్పిస్తారు . మీరు "వూ" "సరే" అనంగానే ఏవేవో లింకులు నొక్క మంటారు . చివరికి ఎవరో ఒక యువతీ  మీతో  మాట్లాడి మీతో ముచ్చట్లకు కూచుంటారు . మీరు అడిగే సందేహాలకు విలువలేదని నమ్మ పలుకుతారు . ఆపై మన ఖాతాల నుండి సొమ్ము మళ్ళించుకొని చివరిలో ఫోనుకు దొరక్కుండా మాయం అయి పోతారు .

అంతర్జాతీయ రంగములో జరిగిన ఒక మోసము చూడండి  .   ఎవరో ఒకరు ఒక సీనియర్ సిటిజెన్ ని సంప్రదించారు . " ఏమండీ ఎలక్ట్రికల్ వెహికల్స్ తయారు చేసే కంపెనీకి మోటార్లు తయారు చేసి ఇచ్చే కంపెనీ నుండి  మాట్లాడుతున్నాము. మా కంపెనీని   ప్రెసిడెంట్ ప్రారంభించాడు. నిధులు సమకూర్చాడు   .ఆ ఫోటోలు కావాలంటే పంపుతాము . మా మోటార్లు  ప్రపంచ వ్యాప్తంగా రోజుకు కోటి వరకూ అమ్ముడవుతున్నాయి . ఆ డిటైల్స్ కూడా పంపుతాము . మీరు కనుక మా కంపెనీలో ఇన్వెస్ట్ మెంట్ చేస్తే -మీకు లక్షకు ఫది వేల చొప్పున లైఫ్ లాంగ్ అందిస్తాము - అవకాశం మిస్ అవవద్దు -- మిమ్మల్ని గురించి, ఎవరో,  మంచివారని రెఫెర్ చేయటం వల్ల .మిమ్మల్ని  ఇన్వెస్టరుగా

ఆహ్వానించటానికి మాకు పర్మిషన్ దొరికింది " అని చెపుతుంది .

విన్నదానికి  కన్విన్స్ అయినాక , చూద్దాము అనుకుంటూ -- అయన ఒక లక్ష పెట్టుబడి పెట్టాడు . నెలతిరిగే సరికల్లా ఒక ఫదివేలు ఆయనకు ముట్టాయి . ఆపై అయన లక్షలు పెట్టు బడి పెట్టాడు . కానీ ఏ ఆదాయమూ రాలేదు .నాసొమ్ము నాకు తిరిగి ఇవ్వండి అని ఈ యన అడిగాడు . ఇస్తాము కాని దానికి కూడా కొంచెము ఫీజు కట్టాలి అని చెప్పి మరి కొంత సొమ్ము లాగారు .సంభాషణలు అన్నీ ఒకరి తరువాత ఒకరుగా యువతులు మాత్రమే చేస్తారు . అనేక మంది ఒకే విషయము మీద మాట్లాడుతూ ఉండటం వల్ల ఎవరు తనను సరిఅయిన దిశలో తీసుకో పోతున్నారో - ఎవరు మోసపు దిశలో తీసుకు పోతున్నారో పెద్దాయన ఊహకు అందక - ఎదుట వ్యక్తి మీద నమ్మకం కలిగినపుడల్లా మరి కొంత సొమ్ము కడుతూ వచ్చాడు .చివరిసారి ఈయన మొండిగా మాట్లాడగా,  అవతల ఉన్న యువతీ -- " సారీ సార్ మీరు అడిగేది మాకు అర్థం కావటం లేదు . బహుశా మీ ఓల్డ్ ఏజ్ వల్ల మీరు సరిగా చెప్పలేక పోతున్నారు

అనుకుంటున్నాము . మీకు గుడ్ లక్ . గాడ్ సేవ్ యు " అని చెప్పి ఫోను పెట్టేసింది .

ఆతరువాత ఈయన మరల మరలా కాల్ చేయగా "మేము చెప్పిన  ఇన్వెస్ట్మెంట్ చేయటం ద్వారా మాతో సంభాషణలు కొనసాగించవచ్చు " అని ఈయనకు మెసేజ్ వచ్చింది .

పై లాంటి సంఘటనలు అనేకము . ప్రభుత్వమునకు తెలుసునా ?  తెలియదా ?

తెలుసును . కానీ డబ్బు ఫొదుపు చేసుకునే వారి వల్ల బ్యాంకుల మీద పడే వడ్డీ చెల్లింపుల భారాన్ని తగ్గించుకునే టందుకు అనేక దేశాలు ఇలాంటి మోసాలను చూడకుండా వదిలి వేస్తున్నాయి అని తేలింది . {బ్యాంకు ఒక పరిశ్రమకు ఋణము ఇస్తుంది అనుకోండి . ఆ ఋణము తిరిగి  వసూలుకావాలంటే - ఆ పరిశ్రమ బాగా నడవాలి . అది బాగా నడవాలంటే - ప్రభుత్వమూ దాని మీద ఓ  కన్నేసి ఉంచాలి . ఇవన్నీ ప్రభుత్వానికి అదనపు పని కదా ? }

మోసగాళ్లు మటుకు డబ్బును కూడ పెట్టుకొని ఏమి చేస్తారు ? వారు కూడా ఎదో ఒక కంపెనీ నో / పరిశ్రమనో తెరవకపోరు . అది కూడా మంచి దేగా అని ప్రభుత్వ పెద్దలు/ అధికారులు ఆలోచిస్తూ ఉంటారుట .
"బ్రిటిష్ వారి కాలము నుండీ భారతదేశములో "రూపాయి ధర్మ" వడ్డీ గా వున్నది . భారత ప్రజలు ధర్మ ప్రభువులు . అంతకు మించిన వడ్డీ అడగరు , ప్రభుత్వము వారు ఆ ధర్మ వడ్డీ ని గనుక ఇస్తే చాలు - చాల మంది వేరే ఇన్వెస్టులమెంట్ ల జోలికి పోరు - మోసపోరు . బ్యాంకులలో కె పోతారు " అని మన దేశము తరఫున మాట్లాడిన పర దేశపు మనిషి అన్నాడు .
" ఇన్వెస్ట్మెంట్ జోలికి ఎవరూ రాక పోతే యాప్ లు వారు బ్రతికేది ఎట్లా ? " సేవింగ్స్ వల్ల బ్యాంకుల మీద పని భారం పెరిగితే, ఆ జీతాలు ఎక్కడనుండి వస్తవి ?బ్యాంకులో ఉన్న డబ్బునుపెట్టు బడులకు ఇచ్చి అవి తిరిగి రాబట్టుకునే శ్రమ ఎవరు పడాలి చెప్పండీ " అని ఆయనకు ఎదురుగా కూచున్నపర దేశపు వాడు ప్రశ్నించాడు .
" అవును- పారిశ్రామిక వేత్తలకు అప్పులు ఇచ్చీ ఇచ్చీ బ్యాంకులు దెబ్బతినటం - అది చూసిన ప్రజలు , ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటు వేయటం దేశ పు

స్థిరత్వానికి  మంచిది కాదు" అని మూడో పర దేశపు అయన అన్నాడు .
రావద్దు రావద్దు అని మోకాలు అడ్డు పెట్టినా సరే బ్యాంకులకే వెళ్ళండి . ఆన్లైన్ మోసాలు ఆగి పోతయ్యి

ఒక టీవీ ప్రోగ్రాం ఆధారంగా - వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి చే కల్పిత రచన

2. మా పెద్దమ్మ కథ   14-5-24

మా అమ్మకు మా పెద్దమ్మ కు ఒక్క సంవత్సరము తేడాతో పెళ్లిళ్లు అయినాయి . నాకు ఐదు సంవత్సరములు వచ్చేసరికి కూడా ఆమెకు పిల్లలు కలగ లేదు. అందు వలన నేను ఆమెకు చాలా బాగా దెగ్గరయ్యాను . మా ఇంటికి ఆవలి సందులో ఆమె ఇల్లు . అందువల్ల నా మకము ఎప్పుడూ కూడా అక్కడనే . ఆమె నా చొక్కా జోబీలో ఇన్ని సెనగ పప్పులు పోసి -ఒక చేతిలో ఒక బెల్లము ముక్క పెట్టి .ఇంకో చేతిలో ఐదు పైసలు పెట్టేది . నేను ఐదు పైసలు కిందకు కొట్టి మళ్ళీ చేయి జాపే వాడిని. అప్పుడు తినేది ఇంకోటేదన్నా ఆ చేతిలో పెట్టేది . అప్పుడు నాకు అంత తెలివి ఉండేది .

మా అమరావతిలో కృష్ణా స్నానాలు చేసీ చేసీ ఆ తెలివి అంత కరిగి పోయి నేటికీ ఇట్లా మిగిలాను .

మా పెద్దమ్మకు పిల్లలు లేరు అని ఏవేవో పూజలు చేస్తూ ఉండేది . ఒక సారి వెంకటప్పయ్య గారని ఒకాయన " కార్తీక మాసము అంతా శివునికి అభిషేకం చేయించి - ఆ తీర్ధము పుచ్చుకొన్నాక మాత్రమే భోజనము చేస్తానని వ్రతము పుచ్చుకుంటే పిల్లలు పుడతారని చెప్పాడు . అలాగే జరుగుతూ వున్నది .

మా పెద్దయ్య గారు పొలము వెళ్లిఉదయం పదకొండుకు తిరిగి వచ్చి - అన్నము తిని నిద్రపోయే వారు . ఇంటిలోని గోడగడియారము గంటలు కొడుతున్నపుడు అయన సగం నిద్రలోనే వుండి " ఏక్ ధో తీన్ చార్ .పాంచ్ ." అని లెక్కవేసి - పాంచ్ బజ్ గయా- అంటూ నిద్ర లేచి మళ్ళా పొలం వెళ్లి పోయే వారు . మళ్ళీ ఏ ఎనిమిదింటికో ఇంటికి రాక .

వెంకటప్పయ్య గారు తీర్ధము తెస్తారు , ఆపై భోజనము చేద్దాము అని మా పెద్దమ్మ కాచుకొని వున్నది . అయన కోసం చూస్తూ మానెడు మినుప పప్పు కూడా విసిరింది,

దానితో  ఓపిక లేక నన్ను కూడా కాసురు కుంటూ వున్నది . వెంకటప్పయ్య గారు ఐదు దాటినాక వచ్చారు . మా పెద్దమ్మ తలుపు వెనుక నిలబడి తీర్ధము కోసము చేయి చాపింది . ఆయన తీర్ధము ఇస్తూ '"తీర్ధము తో పాటు నా వంటి వాడి తో  కూడా ప్రయతించాలి" అంటూ ఓ కొంటె వాక్యము పలికాడు .నేను మా పెద్దమ్మ పక్కనే ఆమె కొంగు లాగుతూ  ఆడుకుంటూ వున్నాను . మా పెద్దమ్మ భద్రకాళి అయింది .

మీ పోలిక కోసం ఏమిటంటే రాజనాల వచ్చి చేయి పట్టుకుంటే భానుమతి ఎట్లా అవుతుందో మా పెద్దమ్మ అట్లా అయింది .చర చర వంటింట్లోకి వెళ్లి తిరగ మాత వేసే ఇనుప గంటె చేత పుచ్చుకొని వచ్చి " ఏక్   ధో  తీన్ చార్ .పాంచ్ " అని లెక్క వేస్తూ వెంకటప్పయ్య గారి నెత్తి మీద బాదింది . ఇప్పుడు నేను అనుకోవటం ఏమిటంటే ఇంకా ఎక్కువ హిందీ ఒంట్లు వచ్చి ఉంటే - వాటి వూతం తో ఇంకా ఎంతో బాది ఉండేది అని. పాంచ్ తరువాత మాట అందక మా పెద్దమ్మ విరామము తీసుకోవటం చేత , అయన చేతిలో వున్నా  ఇత్తడి చెంబు అక్కడనే పారా వేసి బయటికి పరిగెత్తి తప్పుకొని  పోయినాడు .

"ఏమనుకుంటున్నాడో ఏమో " అని ఉరిమింది మా పెద్దమ్మ. ఆ పై గంటె కింద పారవేసింది .
నేను ఆమె పారేసిన గంటెను - అయన పారవేసిన ఇత్తడి చెంబూ అందుకొని
" ఏక్ ధో తీన్ చార్ .పాంచ్ " అని చదువుతూ ఆ గంటె తో ఆ చెంబు మీద బాది -ఆ గుండు భలేగా టాంగ్ టాంగ్ మన్నది - అని నేను అన్నాను .
" ఆ చెంబూ ఆగంటే పట్టుకెళ్లి మేళం వాయించుకుంటూ తిరుగు - ఆ గంటె నా కక్కర లేదు " అన్నది మా పెద్దమ్మ . నేను ఉత్సాహంతో మళ్లా "ఏక్ ధో తీన్ చార్ .పాంచ్ " చదివి చెంబు మోగించాను . కానీ ఇంకా ఏవో మాటలు తక్కువైనవి అని నాకూ మా పెద్దమ్మకీ ఫీలింగ్లు వచ్చాయి . అప్పుడు ఆమె ఒక పాట కల్పించింది . "ఏక్ ధో తీన్ చార్ .పాంచ్ " భజ్ గయా , పేరూరి వెంకటప్పయ్య గుండు భజ్ గయా" ఆపాటను కట్టి నాకు నేర్పింది . నేను అది పాడుకుంటూ చెంబు మోగించుకుంటూ - మాఇంటికి వెళ్ళాను . నా చేతిలోని సామాను చూసి మా అమ్మ కంగారు పడి అవేందిరా ఎక్కడివిరా అని ఆరాలు అడిగింది . ఆపై తిన్నగా వెళ్లి మా పెద్దమ్మని అడిగి వివరం గ్రహించింది . ఆడవారి నోటిలో నువ్వు గింజ దాగుడు కూడా కష్టమే కదా ? వెంకటప్పయ్య గారి గుండు బాజా

ఇంప బడిన  సంగతి క్రమంగా ఊరంతా తెలిసింది .
అందరూ కూడానూ మా పెద్దమ్మ సింగము వంటిది అని
మెచ్చారు .

ఇహ  వెంకటప్పయ్య గారు తన సొంత  ఇల్లు ఖాళీ చేసి
ఏటో వెళ్లి పోయాడు . మళ్లా ఊరిలోకి రాలేదు . మా
పెదనాయన గారే అయన పొలాలను నామ మాత్రపు
ధరకు కొని సొంతము చేసుకున్నాడు .
మా పెద్దమ్మ పాటకు నా బాజా తోడై ఎంతో మంచి
ఫలితాలు తెచ్చినది అని మా పెద్దమ్మ నామీద మరింత
ప్రేమ పెంచుకున్నది.  ఊరిలోకి కొత్త  సినిమా రాగానే
చూచిరా అని చెప్పి నా చేతిలో రూపాయి  పెట్టేది . అది
నాకూ మా అమ్మకీ బెంచి టికెట్ కి సరిపోయేది . మా
అమ్మ నా ప్రయోజకత్వాన్ని చూసి ఎంతో ఆనందించేది .
నేను ఎంతో పెద్ద అయినా పిదప కూడా నాలో ఒక పిల్ల
వాడిని చూసుకుంటూ - ఎప్పుడూ చేతిలో ఎదో ఒక
డబ్బు పెట్టె మా పెద్దమ్మ చాల పెద్దవయస్సులో
నిస్సంతుగా - భర్త సమక్షం లో మరణించింది          ."
నన్ను చిన్న పిల్ల వాడి మాదిరి చూసుకునేది -
ఇప్పుడెవరు నాకు దిక్కు " అని మా పెద్దయ్య గారు
విచారించి విచారించి ఆమె స్మృతిలో మరణించారు .

వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి సొంత రచన



1. పాప ప్రక్షాళనం 13-05-24

జెర్మనీ దేశపు జాతి అహంకారి  హిట్లరు - న మూలంగా ఎందరో యూదు ప్రజలు కాన్సెన్ట్రేషన్ క్యాంపుల్లో హీనాతి హీనంగా చని పోయారు .అనేది చరిత్ర .

హిట్లరు చేసిన పని జెర్మనీ దేశానికి " జాతి అహంకార దేశము " అనే కళంకాన్ని  అంటకట్టి వెళ్ళింది . నేడు అక్కడ ఉన్న యువత తమ దేశము చేసిన  పాపాన్ని ప్రక్షాళనం లేదా కడిగి వేయాలని నిశ్చయించుకున్నారు . వీరు మెడికల్ రంగము లో ఉన్న యువత.          వారు బయట పెట్టినవిషయాలలో కొన్ని

ఒకటి } వైద్యము చేసే టపుడు జర్మన్ లేదా జెర్మనీ లో ఉన్న  తెల్ల డాక్టర్లు - తక్కువ రంగు కల జాతి పేషేంట్ల పట్ల సరిఅయిన శ్రద్ధ చూపించుట లేదు  . రంగు తక్కువ పేషేంట్ లు చెప్పిన వివరాలను  శ్రద్దగా వినటం లేదు .జెర్మనీలో ని ఒక డాక్టర్ పేషేంట్ మీద వెచ్చించే సగటు సమయము ఎనిమిది నిమిషాలు కాగా రంగు తక్కువ వారి మీద వెచ్చించే సమయము సగటున మూడు నిమిషాలకు మించటము లేదు .-
రెండు } - వైద్య గ్రంధాలలో ని చర్మ వైద్యం అంతా,  తెల్లని శరీరం ఉన్న వారికి వంటి మీద వచ్చే మచ్చలు ,

కురుపులు , వంటిని ఉదహరిస్తూ -  వైద్యాన్ని ప్రతి పాడిస్తున్నది .నల్ల శరీరము కల వారి కి వచ్చే చర్మపు జబ్బుల  గురించి వివరాలు జెర్మనీ వైద్య విద్యార్థులకు అందుబాటులో ఉండుటలేదు .వాటి మీద కూడా పాఠాలు ఉండాలి .

మూడు } వైద్యము లో కొత్త మందులు వచ్చినపుడు వాటిని ముందుగా రంగు తక్కువ రోగుల మీద ప్రయోగిస్తున్నారు . ఉదాహరణకు -   ఎదో జంతువు రక్తము నుండి తీసిన రక్త కణాలు గుండె జబ్బులకు పనికి రావచ్చునని తోచి ఆ కణాలను రంగుతక్కువ రోగిలోకి ప్రవేశ పెట్టారు . ఆమె గుండె జబ్బు నుండి కోలుకున్నాక. అది తమ విజయం గా పేర్కొంటూ  డాక్టర్లే ఆ విషయం బయట పెట్టారు . ఇదే తెల్ల రోగుల అయితే  ఇలాంటి వైద్యం చేస్తారా?  అన్న ప్రశ్న తల ఎత్తింది . ఈ సంఘటన ద్వారా జెర్మనీ లోని   జాతి వివక్ష ను గురించి ప్రశ్నించారు .

నాలుగు } ఒక నల్ల రోగి నాకు త్రీవ్రమైన కడుపు నొప్పి అని వైద్యానికి వచ్చింది .
అప్పుడు ఒక జర్మనీ వైద్యుడు " మీ నల్ల వారికి ఓర్చుకునే శక్తీ /ఓర్పు చాలా ఉంటుంది . మీరు 24

గంటల పాటు రిలాక్స్ అవ్వండి . ఆతరువాత చూద్దాము " అని చెప్పి పంపాడు .కానీ ఏ వైద్యము అందించలేదు .

ఐదు } 1960  వరకూ కూడా చాల ఆఫ్రికన్ దేశాలు ఇంగిలీషు వారి పాలనలో వున్నాయి . ఆరోజులలో వైద్యము మీద రీసర్చ్ చేసేవారు " కొంతమంది నల్ల వారిని మాకు కేటాయించండి " అని ఇంగిలీషు ప్రభుత్వము వారిని కోరి,  పర్మిషన్ పొంది , నల్ల వారి మీద.  వారు చనిపోయేదాకా గూడా దారుణ పరి శోధనలు చేసేవారు .

నల్ల వారు వుండే దేశాలు స్వాతంత్రము పొందినాక చాల మంది వైద్య పరిశోధకులకు  ,  ప్రయోగాలు చేయటానికి కావాల్సిన మనుషుల కొరత ఏర్పడింది.  దానితో హాస్పిటల్స్ అనే వ్యవస్థను ఏర్పాటు చేసి - రోగులను అందులో చేర్చుకొని వారి మీద పరిశోధనలు చేస్తూ వస్తున్నారు . ఇలాంటి పరిశోధనలకు అవసర పడతారని నల్ల రంగు రోగులను ఎక్కువగా హాస్పిటల్ లోకి చేర్చుకుంటూ వున్నారు . ఆ అవసరం లేక పోయినా . పై   మూడు నాలుగు ఐదు సంగతులలోని విషయాలు వైద్య విద్యార్థులు తమ ఆందోళనల ద్వారా  ప్రభుత్వానికి

తెలిపారు . ప్రభుత్వం స్పందించి  రంగు తక్కువ లేదా జెర్మనీ జాతి కానీ వారు  ఎవరైనా - "రంగు వివక్ష కారణంగా మాకు తక్కువ రకపు వైద్యము జరిగింది " అనే ఫిర్యాదు చేసుకోవటానికి అవకాశాలు కల్పించి - డాక్టర్ లను అదుపులో పెట్టింది .

వైద్య విద్యారుదులు బయట పెట్టిన విషయాలు అన్నీ " జెర్మనీ ప్రజలు జాతి అహంకార ధోరణిని వ్యతిరేకిస్తారు " అనే విషయాన్నీ లోకానికి వెల్లడి చేయాలి అనే దృక్పధంతో చెప్పినవే . కాబట్టే నావరకూ తెలిసాయి . ఈ రకంగా వారు తమ దేశము మీద పడిన చెడు ముద్రను తుడిచి వేసుకొనే ప్రయత్నం చేశారు . ఇంకా అనేక రంగాల లో ఉన్న వర్ణ వివక్ష మీద కూడా అక్కడి యువత పోరాటాలు చేస్తున్నారు .
వుందాహరణకు -పిల్లల పాఠ్య పుస్తకాలలో వుండే  కింగ్ అండ్ క్వీన్ అనే మాటల పక్క  - తెల్లని రంగులో ఉన్న రాజు , రాణి బొమ్మలు వేస్తారు .  వేరే రంగు వారివి ఎందుకు వేయరు ? వారిలో  రాజులు రాణులు లేరా ?అనే ప్రశ్నలు లేవదీసి విద్యావ్యవస్థలో ఉన్న వర్ణవివక్షను తొలగించటానికి ప్రయత్నిస్తూ వున్నారు .

పై విషయాలు అన్నీ జెర్మనీకి సంబంధించినవి . ఇక మన దేశములో డబ్బు ఉన్న వారికి, గొప్ప ఉద్యోగులకు ఒక రకపు వైద్యము - వైద్య సలహాలు అందుతున్నావని - డబ్బు లేని వారికి, చిన్న తరగతి ఉద్యోగులకు వేరే రకము వైద్యము అందుతున్నది అని నాకు వచ్చిన- ఆధారము లేని  అనుమానము . దీనికి మీరేమి అంటారో మరి ? అందరికీ ఒకరకంగా , అన్నినాతో పాటుగా సమంగా  అందాలి,  అని నినదించటం ద్వారా  మనము కూడా కొంత పాప ప్రక్షాళన చేసుకో వచ్చు .

12 -05 -24  న జెర్మనీ నుండి వచ్చిన ఒక వార్త కథనం ఆధారముగా రాసినది
వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి
—-----------------------------------------------------------
---



WRITER VARANASI SREE RAMAKRISHNA
WITH HIS SON V S SREE KANTH ON
6-7-24
IN A FLIGHT FROM TRIVENDRUM TO
BANGLORE